# కారుణ్యం

కథల సం[illegible]

కొడవటిగంటి కుటుంబరావు

యువ కార్యాలయ ప్రచురణం.          నాలుగణాలు.

# విషయసూచిక





# నా కథలు

నేను కథలురాసి ప్రకటించటం ప్రారంభించి ఆరు సంవత్సరాలు దాటింది. జనసామాన్యానికి—పాఠక లోకానికి—నా కథలను గురించి ఎటువంటి అభిప్రాయం ఉందో తెలుసుకొనటానికి నాకు అవకాశం దొరకనేలేదు. నామీదగల అభిమానం చేతనైతేనేమి, నాకు ప్రోత్సాహం ఇచ్చే సదుద్దేశంతో నైతేనేమి చాలామంది పెద్దలు నా రచనలను నా ప్రోద్బలం అవసరం లేకుండానే శ్లాఘించారు. ఒకరిద్దరు మరి కొంచెం పైకివెళ్ళి నామాదిరిగా కథలు రాసేవాళ్ళు లేరనేదాకా వెళ్ళారు. వారి సదభిప్రాయాలకు నేను కృతజ్ఞుణ్ణి.

అయితే ఆ సదభిప్రాయాలకు నేను చలించలేను. ఒకరి మెప్పుకోసరం ఇంతవరకు నేను ఏ కథా రాయలేదు. నాకు ఒకటే ఆశయం—నా రచనల వల్ల కూడా మనోవికాసం పొందదగినవాళ్లు తెలుగు వాళ్ళల్లో ఉండితీరాలి, వారందరూ నా కథలు చదవాలని నా కోరిక. వారందరికీ నా రచనల మీద ఎంత త్వరగా ఏవగింపు కలిగితే అంత ఉపకారం చేసినవాణ్ణవుతాను తెలుగు సారస్వతానికి. అప్పటికి తెలుగు సారస్వతానికి నాతో పని అయిపోతుంది. నాకథలు చిరస్థాయిగా ఉండిపోవాలనే ఆశ నాకు ఏ కోశానా లేదు.

ఇంకా ఎప్పుడో పుట్టబోయ్యే వాళ్ళకొరకు రాస్తున్నాననే అహంకారం కూడా నాకు లేదు. నేను ఆకాశంనించి ఊడిపడలేదు. నాకు పూర్వం కథలు రాసినవారు ఎక్కడ

వదలిపెట్టగారో నేను కథారచనను అక్కడే అందుకోగలను కాని అంతకుపైన ఎట్లా అందుకోగలను?

అనేక కారణాలవల్ల నేను పత్రికలకు కథలు పంపటం మానుకున్నాను.

కొద్దిమంది ధనికులు ఒక కళను పోషించటమనేది నాకు గుచోచదు. ఆ కళను ఎవరెవరు అనుభవించ గలుగుతున్నారో వారి వల్లనే కళ పోషించబడాలి. తెలుగులో జయప్రదమైన పత్రిక ఒక్కటిలేదు. అందుచేతను ఆ యా పత్రికలు తమ రచయితలకు ఏమీ ఇవ్వలేవు. ఏదాత అయినా ఇస్తుంటే అది "ముష్టి" అన్నమాటే కాని వేరొకటి కాదు. లేదా పత్రికలకు రచయితలు వ్యాసాలను ఉచితార్థం పంపాలి. నాకీ రెండుపద్ధతులూ సరిపడవు. అదీకాక నేను కథలు రాసినంత వేగిరంగా అచ్చువేసే పత్రికలు—రచనలకు ప్రతిఫలం ఇచ్చే పత్రికలు—కూడా లేవు. నా కథలు నలుగురి కథలతో పాటుగా పత్రికలలో ప్రకటించ బడుతూఉంటే నాకథలు ఎంతమందికి కావాలో తెలియటం అసంభవం, పత్రిక ఎన్ని వేల కాపీలుఅమ్మినా. నలుగురూ నన్ను మెచ్చుకున్నారుగదా అని కళ్లుమూసుకుని తృప్తిపడేకంటే కేవలమూ నా కథలే కలిగిన గ్రంథం ఒక వెయ్యికాపీలు అమ్మినా నాకు గర్వించటానికి కొంత అవకాశం ఉంటుంది. ఈ కారణాలవల్ల నేను కథలను పత్రికలలో ప్రచురించటం మానుకున్నాను. ఇకముందు నా రచనలు ఈ విధంగానే సంపుటాలుగా ప్రకటించబడతై.

ఇక నేను సారస్వతానికి చెయ్యజూస్తున్న ఉపకారాన్ని గురించి.

నేను ప్రచారకుణ్ణి కాను. ప్రతిసమస్యనూ నేను రెండు వైపులనించీ చూడగలను.

నేను సహజంగా ఉండేటటువంటి కథలు రాయటానికి కంకణం కట్టుకోలేదు. ఈసంపుటంలో నే అసహజంగా కనిపించే కథలు రెండుమూడున్నై.

నేను నీతులుకూడా బోధించను. అమలులో ఉన్న నీతి చట్టానికి విరుద్ధంగా ప్రవర్తించినవారిని నేను సమవర్ధించుతూ రాసిన కథలుకూడా ఈ సంపుటంలో లేకపోలేదు. ఆ కథల్లో నీతి ఉన్నదని ఎవరైనా భావించినట్టయితే వారంతరూ ఆవిధంగా ప్రవర్తించటానికి నేను అనుమతించినవాణ్ణి అవుతాను. నేను అటువంటి అనుమతి ఎంతమాత్రమూ ఇవ్వటంలేదు.

ప్రతివిషయాన్నీ నూతనదృష్టితో చూడటం నాకు చాలాఇష్టం. అదే సరిఅయినదృష్టిఅని నేను వాదించను మరి కొంతకాలానికి మరొకదృష్టితో ఆ విషయాన్ని చూడగల సమర్థుడు రావచ్చును.

సారస్వతం బోధచెయ్యకూడదని నా నమ్మకం. సరి అయిన సారస్వతం మన ఆలోచనలు రేపి ఆ ఆలోచనాశక్తిని వృద్ధిపరచి వదిలెయ్యాలి.

నాపాత్రలతో నేను ఒకటైపోవటం నాకిష్టం లేదు. అటువంటి రచనలను నేను ఉత్తమ తరగతిలో వెయ్యలేను. కథ

లలో పాత్రలను కథకుడు ఎందుకు నిర్బంధించాలో నాకుఅర్థం కాకుండాఉంది నావిశ్వాసాలను నేను నాపాత్రలమీద గాని పాఠకులమీద గాని ఎందుకు పామాలి ?

“అనంతం” అనే కథలో భగవంతుడున్నాడనే నమ్మకాన్ని ఆకాశానికెత్తాను. అది నా విశ్వాసంకాదు. అట్లాగే “పెంకిపిల్ల” అనే కథలో కొసకు ఒక ప్రశ్న వేశాను. ఆ అనుమానం నాదికాదు.

ఈ సంపుటంలో మొదటికథను గురించి ఒకముక్క-చెప్పవలసిఉంది. Strand Magazine లో కొన్ని మాసాల క్రితం *The Quality of Mercy* అనే కథను చదివి ఆనందించాను. అది చదవకపోయినట్టయితే నేను ఈ “కారుణ్యం” అనే కథను రాసిఉండను

కొడవటిగంటి కుటుంబరావు

# ౧ కారుణ్యం

ఒకప్పు డనుకునేవాణ్ణి నాకిక పెళ్లి కాదేమోనని. నాకోసరం కనీసం ఇరవైమంది పిల్లలనైనా చూసిఉంటారు మానాన్నగారు. నాకు కాబోయే భార్యను “పాసు” చెయ్యవలిసినవారు మాబలగంలో చాలామంది ఉండేవారు. మా నాన్నగారు ఏసంబంధం తెచ్చినా ఇంతమందిలోనూ ఎవరికో ఒకరికి ఏదోలోపం కనిపించితీరేది ఆసంబంధంలో. సంబంధాలు తీసుకురావటం మానాన్నగారివంతు గనక తప్పులెన్నవలిసిన వారిలో ఆయన ఎన్నడూ లేరు. నేనుకూడా లేను. ఎందుకు లేనో నాకు చాలాకాలంవరకూ బోధపడకపోయింది. చివరకు నాసంశయం మాఅమ్మగారు తీర్చింది.

“మొదలుమమ్మల్ని చూడనీ! ఇంకా నీదాకారాందే!”

అనగా వారు కొట్టివెయ్యాని కేసులు నేను కొట్టివెయ్యటానికిగాని ఆమోదించటానికిగాని అధికారం ఉండేకాని, నాకై నేను ఏకేసున్నా ఆమోదించటానికి అధికారిని కానని.

నాకన్న మానాన్నగారే ముందు తిరగబడ్డారు మా బలగంమీద.

“రాముడికి వీరభద్రరావుగారి అమ్మాయి ఖాయం! ... ఇక నేనెవరి సలహాకూడాతీసుకోబోవటంలేదు,”అన్నారాయన.

“తొందరపడకండి. ముందూ వెనకా ఆలోచించకుండా దిగితే తరవాత జన్మజన్మేపీ భరించాలిసింది మనమే,” అని మాఅమ్మగారు అందుకుంది.

"రేపు తాంబూలాలు పుచ్చుకోబోతున్నాను!"

"ఈసంబంధంలో విశేషమేమిటి కాస్తచెప్పు, బావా?" అన్నాడు మా మేనమామగారు.

"విశేషం ఏమిటా? వీరభద్రరావుగారు రెండు వేలు కట్నం ఇస్తారు. అదేవిశేషం!"

"అమ్మగో! నువ్వెప్పుడూ డబ్బు, డబ్బుఅని అన్నీ పాడు సంబంధాలు తెస్తున్నావు. పెళ్ళి విషయమై నీకు కించిత్తయినా లోకజ్ఞానం—"

"ఓరి, పిచ్చివాడా! పిల్లదానిపేరు జానకి, మనవాడి పేరు రాముడు. అంతకన్న విశేషంఏంకావాలి, బావా?" అని మానాన్నగారు ఉపాయంగా మా మేనమామను వదిలించుకున్నారు.

తీరా తాంబూలాలు పుచ్చుకుని ముహూర్తంకూడా ఏర్పాటు చేసుకున్నతరవాత మాబలగం ఆసంబంధంలో పెద్దలోపం కనిపెట్టగలిగింది. వీరభద్రరావుగారికి ద్వితీయ కళత్రం. ఆమె కఠినస్వభావురాలనీ పరుషంగా మాట్లాడుతుందనీ చెప్పుకుంటారట. నాకు ఆవిడ సవతిఅత్తగారు అవుతుంది కనక నన్ను సరిగా చూడదేమోనని మావాళ్ళభయం!

నాకు ఒకటేభయం—ఆ జానకి అందగత్తె కాదేమోనని. పిల్లది అందంగా ఉంటుందా అని అడగటం నాకు నామోషీ. నేను కురూపిని అని లోకం అభిప్రాయపడ్డతరవాత నాకు అందగత్తెను తెచ్చి ముడిపెట్టాలని ఎవరికేమంత యావ ఉంటుంది?

జానకి అసామాన్య సౌందర్యవతి అనేవిషయం మా నాన్నగారు బయటపెట్టలేదు. ఆపని మరెవరో చేశారు — నేను ఫలానివారిపిల్లనుచేసుకోబోతున్నానని తెలిసి, "ఆపిల్లా? ఆపిల్ల చాలాఅందంగాఉంటుందే!" అన్నారు, ఆపిల్లను నేను పెళ్ళాడటానికి అదొక పెద్దఅంతరాయమల్లే!

నా అనాకారితనంతో పోల్చి ఆపెద్దమనిషి నా కాబోయే భార్యను అందగత్తె అని ఉంటాడు, సామాన్యపు సౌందర్యమైనా ఉండకబోతుందా అనుకున్నాను. కాని జానకి నాకళ్ళపడగానే నాకు చాలాకష్టంవేసింది. అందరికీ ఉన్నంత స్వార్థం నాకూఉంది. అయితే న్యాయబుద్ధి అనేదికూడా నాకు భగవంతుడు ప్రసాదించాడు. అంతచక్కని పిల్లను తెచ్చి నాకు అంటగట్టటం చాలాఅన్యాయం. నాకంతఆశ ఎన్నడూ లేదు. నాకు కాబోయే భార్య ఏమాత్రం సంసారపక్షంగాఉన్నా నేను తృప్తిపడి ఉండేవాణ్ణే!

జానకిని చూసి మావాళ్ళంతా తృప్తిపడ్డారు. ఆమెకు నేను తగిన భర్తనేనా అనేమాట మావాళ్ళకెవరికీ తట్టలేదు.

సహజంగా పెళ్ళికూతురివైపు వచ్చినవారందరికీ తట్టిన అంశమే అదీ! నన్నుచూసి వారంతా అసహ్యించుకున్నారు. ఆ అసహ్యాన్ని దాచాలనికూడా వారెటువంటి ప్రయత్నమూ చేయలేదు; నావంక వారంతా అసహ్యంగా చూసేవారు, నాకువినిపించేటట్టు అసహ్యమైన మాట లనేవారు.

"మావీరభద్రుడికి ఇంతమతిలేదని నేనెన్నడూ అనుకోలేదు!" అని ఒకపెద్దమనిషి నావంకే చూస్తూ అన్నాడు.

నాప్రాణం చివుక్కుమంది. నన్ను నేను లోకువచేసుకోవటమూ మరొకరు నన్ను లోకువ చెయ్యటమూ ఎన్నడైనా ఒకటి అవుతవా?

జానకి పినతల్లికొడుకు, కాళిదాసనే అతను నాకు నావివాహం మొదటిరోజునించీ స్నేహితుడైనాడు. అతనికి నామీద అభిమానంకూడా ఏర్పడ్డదని చెప్పగలను. లేకపోతే అతను, నన్నుగురించి ఎవరెవరు ఏమేమి అనుకుంటున్నారో, అవన్నీ పూసగుచ్చినట్లు చెప్పిఉండడు. కాని అతని అభిమానం నాప్రాణంమీదికి వచ్చింది. అతని మాటలు నాకు బల్లెపుపోటల్లే అయేవి.

"నన్ను కనికరించి ఇక ఈకబుర్లు మానేస్తూ!" అని అతనితో అందామని ఎన్నోసార్లు నాకు నాలికచివరదాకా వచ్చింది. కాని అనలేకపోయినాను. ఈబాధకు అలవాటైపోకపోతానా అనుకుని మాట్లాడకుండా ఊరుకున్నాను.

ఆయెడారిలో జలప్రదేశంలాగా కనపడ్డది మా సవతి అత్తగారు కమలమ్మ. ఆమెకు ముప్పైలోబడ్డ వయస్సుంటుంది. పెద్దఅందగత్తెకాదు కాని కళగలమొహం. చూడగానే గంభీరస్వభావురాలనిపించింది. కాని నాతో ఆమె చాలా ప్రేమపూర్వకంగా మాట్లాడేది. నా అనాకారితనం గమనించని మనిషి ఆమె ఒక్కతే అనుకున్నాను.

ఆమాటే నేను కాళిదాసుతో అంటే అతను వికటంగా నవ్వి, "నువ్వు బాగుండవని విని ఆవిడ ఈసంబంధం కాకుండా చెయ్యటానికి ఎంతప్రయత్నంచేసిందో తెలుసా?" అన్నాడు.

నేను ఆశ్చర్యపడి, "అయితే మరి మా అత్తగారిప్పుడు నన్నింత బాగా చూస్తూ ఉండటానికి కారణం ఏమిటీ? ఆమెను చూస్తే నాకుప్రాణం లేచివచ్చినట్లవుతుంది!" అన్నాను.

కాళిదాసు రహస్యంగా నాచెవిలో "పిచ్చివాడా, ఎవత్తెకైనా సవతికూతురు మీద ప్రేమ ఉంటుందిటోయ్? జానక్కి అనాకారి మొగుడువస్తే కమలమ్మకు సంతోషం కాదూ?" అన్నాడు.

అతని వాదనలో పొరపాటు నేను వెంటనే పట్టేశాను. "అయితే మొదట్లో నన్ను పడగొట్టాలని ఎందుకుచూసింది?"

ఆప్రశ్న వెయ్యటం నాదే బుద్ధితక్కువ. కాళిదాసు లోతులేని మనిషి. అతనికి మెదడు తక్కువని నేను గ్రహించి ఉండవలసింది. ఆకాస్త మెదడునూ నా అమాయకపు ప్రశ్నతో కెలికి ఉంటాను. ఆకాస్త మెదడూ బురదలేచి కెలుకులైన నీటిమాదిరిగా అయిపోయింది. అతను కాస్సేపు కంగారుతో ఏదో అర్థంలేని మాటలు మాట్లాడి, చివరకు నామీద కోపం తెచ్చుకున్నాడు నేనేమో పెద్ద అపకారం చేసినట్టు. మరి కాస్సేపటికి అతను నాదగ్గిర్నించి లేచి అవతలికి వెళ్ళిపోయినాడు. ఆకాస్తనీరు మళ్ళీ తేరుకోగానే తిరిగి వస్తాడులెమ్మనుకున్నాను.

ఇది జరిగినప్పటినుంచీ కమలమ్మగారు నా మనస్సులో నా ఆలోచనల్లో, ఒకస్థానం ఏర్పరుచుకుంది. ఆమెను అర్థం చేసుకోవాలని నాకు అభిలాష జాస్తి అయింది.

పెళ్ళి నాలుగోనాడు రాత్రి బూజంబంతి అయిన తరవాత ఊరేగింపు ఏర్పాటుచేసుకున్నారు. నేనూ మావధువూ

వచ్చి పల్లకీలో కూర్చున్నాం. పల్లకీ ఎత్తారు. కమలమ్మగారు నాదగ్గిరకు వచ్చి నా బుగ్గన పెట్టిన కాటుకబొట్టు— కొంచెం చెదిరింది కాబోలు—సరిచేస్తున్నది. వెనకఉన్నవారిలో ఎవరో నవ్వారు. ఆవిడ నవ్వగానే మరొకరు నవ్వారు బలవంతాన ఆపుకోవాలని ప్రయత్నం చేస్తూనే. మరొక క్షణంలో ఆనవ్వు యెట్లా ప్రారంభమయిందో అట్లాగే చప్పున మాయమైంది.

నా ఒళ్ళు మండిపోయింది. ఈ ముసుకులో గుద్దులాట ఎన్నాళ్ళు? నేనంత అసహ్యంగా ఉంటానని తోస్తే నా మొహాన అనెయ్యరాదూ? నాఅంతట నేను గ్రహించుకునేట్టు ఈసూచన లెందుకూ?

నేను మాఅత్తగారివంక చూశాను. ఆమె నావంకే చూస్తున్నది. ఆమె మొహంలో, పాపం, రక్తంలేదు. నేను తన వంక చూడగానే ఆమె మొహం తిప్పుకుని వెళ్ళిపోయింది.

ఊరేగింపు సాగబోతుండగా ఆమె మళ్ళీ మాదగ్గిరికి వచ్చింది. ఆమె మొహంలో మార్పు నాకు కొంచెం ఉపశాంతి కలగజేసింది. ఆవిడ నేరుగా జానకిదగ్గిరికి వచ్చి,"నువ్వెందుకు తలవంచుకుంటావే, పిల్లా?" అని జానకి తలకాయ బలవంతాన పైకి ఎత్తి, నాతో "చూశావా, నాయనా? మా పిల్లనుచూసి నువ్వు తలవంచుకోరాదూ?" ... అద్దం తీసుకురానా?" అన్నది నవ్వుతూ.

ఆవిడ మాటలకు నా హృదయం పొంగి పొర్లసాగింది. నాకు కలిగిన ఆనందం చెప్పలేను.

"ఎందుకండీ ? మీపిల్ల మొహం అద్దం మాదిరిగా ఎదట ఉంటే వేరే అద్దాలెందుకూ?" అన్నాను.

మాసంభాషణ ముత్తయిదువులంతా వినే ఉంటారు. ఆ తరవాత వారు నావంక వ్యంగ్యాన్ని చూసినట్టు చూడటం మానారని రూఢిగా చెప్పగలను.

కారుణ్యం అనేది ఎట్లా ఉంటుందో నాకు. మా అత్త గారు అప్పుడు తెలియజేసింది. నావివాహం అయిన సంవత్సరం లోపుగానే ఆమెను ఎవరూ అర్థం చేసుకోలేక పోయినా రని నేను గ్రహించాను.

జానకిని నాకివ్వకుండా ఉండాలని ఆవిడ ప్రయత్నం చేసినమాట నిజమే. అదికూడా ఆమెకు నాభార్యమీదగల దయచేతనే. వివాహం జరిగి తీరుతుంది అని తోచిన తరవాత ఆమె చేసిన ప్రయత్నం యావత్తూ నేను కళ్లార చూశాను.

కాపరానికి వచ్చిన తరవాత మాజానకి నన్ను ఎట్లా చూస్తే సుఖపడుతుందో మా అత్తగారు జానకి ఎదట నన్ను అట్లాచూసేది—జానకి కాపరానికి రాకపూర్వం నేను వారింటికి వెళ్ళినప్పుడల్లా.

నేను రాగానే ఆమె ఎంతోగౌరవంగా లేచి నిలబడేది. నేను వింటూండగా ఆమె బిగ్గిరిగా మాట్లాడేదికాదు. మరొ కర్ని బిగ్గిరిగా మాట్లాడనిచ్చేదికాదు. నన్ను "ఏమండీ" అని పిలవటంకూడా ప్రారంభించింది.

ఆవిడ దయవల్ల నేనూ నాభార్యా ఈనాటికీ ఎంతో సుఖంగా కాపరం చేస్తూన్నాం. నాభార్య నన్ను సుఖపెట్టి

నట్టు అందరు భార్యలూ తమ తమ భర్తలను సుఖపెట్టగలి గితే ప్రపంచం స్వర్గంగా మారిపోను.

కాని జానకి ఎన్నడూ, తనసవతితల్లిని తలపకపోవటం నాకు చాలా ఆశ్చర్యకరంగా ఉండేది. నాలుంతట నేను ఆవిడ విషయం తెస్తే జానకి నావంక ఒకరకంగా చూసి మాట్లాడ కుండా ఊరుకునేది. నేనుమాత్రం ఆవిడవిషయం ఎత్తటం మానలేదు.

అకస్మాత్తుగా నా భార్య ఒకసారి, "ఇదివరకల్లా ఆవిడే మీామీాద కన్ను వేసి దనుకునేదాన్ని, మీారుకూడా—" అని ఆగింది.

నాప్రాణం చివుక్కుమంది.

"జానకీ, నీకుకూడా ఆవిడ అర్థంకాలేదా?......ఆవిడ మీాద నీకు ఆపేక్ష లేదా?" అన్నాను.

"సవితితల్లికీ సవితికూతురికీ ఎక్కడన్నా ఆపేక్ష ఉంటుందా?"

"సవితితల్లి అనేనా? ఆవిడ నీమీాద ఏమైనా అసూయ చూపేదనా?"

"ఆవిడకు అసూయ లేదనా? ఉన్నప్పుడు సరిగా ఉన్నా మధ్యమధ్య ఆవిడ చాలా మోటుగా మాట్లాడుతుంది. ఆవిడది ఎట్లాఅయినా కఠినహృదయం మన పెళ్ళిలో ఊరేగిం పులో చూడండి మిమ్మల్ని ఎట్లాఎగతాళిచేసిందో! మానాన్నకు కూడా తెలుసు. అందుకనే ఆయన నన్ను ఎప్పుడూ ఒక కంట కనిపెట్టే ఉండేవాడు."

మానవ ప్రకృతి చాలా విచిత్రమైనది. కమలమ్మను అర్థంచేసుకున్నవాణ్ణి నేనొక్కణ్ణేనని నాకు తోచిపోగానే నాలో ఒక విధమైన వికారం ప్రారంభమైంది. ఆమెను నేను వెర్రిగా ప్రేమించసాగాను. నాకు జానకినెందుకు భగవంతుడు భార్యగా చేశాడూ? నాకు కావలసిన మనిషి కమలమ్మ!

ఈ ప్రణయ బీజం మనస్సులో నాటుకున్న తరవాత అది పెరిగి పెద్దదై చిలవలూ, పలవలూ వేసి మనస్సంతా ఆక్రమించుకుని ఎంతగందరగోళమైనా చేసింది. కొద్ది రోజు ల్లోనే నాకు అవిడధ్యానమే అయిపోయింది. చివరకు నేనామె కోసరం నిద్రాహారాలుకూడా సరిగా లేనివాణ్ణయిపోయి విరహం అనుభవించసాగాను.

కొద్దిరోజుల్లోనే, నేనూ, మాజానకీ మా అత్తవారిం టికి వెళ్ళవలిసి వచ్చింది ఏదో పండుగ కారణంగా. కమల మ్మను చూడగానే నేను ఉన్మత్తుణ్ణి అయిపోయినాను. ఆమె తో ఒంటిరిగా అయిదు నిమిషాలు మాట్లాడ గలిగితే! నా ప్రేమను— నాసార్థకమైన ప్రేమను — ఆమె ఎట్లా తృణీక రిస్తుంది? ఆమె నన్ను తిరిగి ప్రేమించగలిగితే ప్రపంచం ఏమయితేనేం ?

నేను జ్వరితుణ్ణయి ఎదురు చూస్తున్న అవకాశం ఒకనాడు ఎట్లాగో లభించింది. నేను తడబడుతున్న మాట లతో నాహృదయం ఆమెముందు విప్పి పెట్టాను. ఆమె హృదయం నేనెంత బాగా అర్థం చేసుకున్నానో ఆమెకు తెలియజేశాను. ఆమె కారుణ్యాన్ని గురించి కూడా ఒక ముక్క అన్నాను.

ఆమె తాపీగా నామాటలన్నీ ఆలకించి, "నాకారుణ్యాం నీకు సరిగాఅర్థమైనట్టులేదు. మీరామారావుగారిని పిలిచి నీగోడవ ఆయనకు చెప్పిన తరవాత నా కారుణ్యాం నీకు చక్కగా అర్థం అవుతుంది!'' అని ఆమె చరాచరా వెళ్ళిపోయింది.

"ఏమండోయ్!'' అని ఆవిడ మా మామగార్ని కేక వెయ్యటం నా చెవుల బడ్డా పిడుగల్లే.

నా జ్వరం ఒక్క దెబ్బతో మాయమయింది. నా శరీరం చలవలు కిమ్మింది. నేను నాభార్య విషయంకూడా ఆలోచించకుండా వెంటనే ఆయిల్లు వదలిపెట్టి రైలెక్కాను.

ఇంతకూ మాఅత్తగారు భర్తతో నామీద ఏమీ చెప్పలేదని తేలిపోయింది. కాని నామనస్సును ఒకప్పుడు ఆవరించిన విషవృక్షం తాలూకు సన్నని వేరైనా అక్కడ లేదని నేను లోకానికి మనవి చేస్తున్నాను.



# ౨ జైలు ఖా నా

వెనక అంతా సముద్రమే. ఎక్కడా భూమి లేదు. ఆ రోజుల్లో మనుష్యులు ఆ సముద్రపుఅలలమీద తేలి ఆడుకుంటూ ఉండేవాళ్ళు. వాళ్ళకప్పుడు ఆకాశంలోకి ఎగిరే శక్తి కూడా ఉండేదనుకుంటాను. కాలక్రమాన బుద్ధి పరిపక్వంఅయి ఆ అలలమీద ఊగడమూ, ఆ సముద్రంలో ఈదటమూ

మొదలైన ఆటలమీద మొహంమొత్తినప్పుడు వారు అట్లా ఆకాశంలోకి ఎంతో ఎత్తుగా ఎగిరిపోయి అక్కడినించి ఆసము ద్రాన్నీ, అందులో ఆడుకుంటున్న వాళ్లనీ చక్కగా గమనించి అపార ఆనందం అనుభవించేవారు. తమ మాదిరిగా ఎగరటం నేర్చుకోలేక ఆడుకోటమే పరమావధిగా పెట్టుకున్న వారిని చూస్తే వీరికి కోపంలేదు, అసహ్యంలేదు; "ఇంకా క్షుద్రవాళ్ళు! ఆడుకోనీ!" అనుకొనేవారు.

కాని కాలం గడిచినకొద్దీ సముద్రంలో కొంతభాగం దిబ్బవెయ్యసాగింది. ఆ దిబ్బ నానాటికీ పెద్దదికాసాగింది.

అది ఏమిటో చూతామని కొందరు ఆ దిబ్బమీదకి ప్రయాణమైనారు. తీరా అక్కడచేరిన తరవాత అక్కడికి వెళ్లినవారికి ఆదిబ్బనుగురించి రెండురకాలఅభిప్రాయాలుకలిగినై.

"ఎబ్బే! ఇక్కడ ఏమీ బాగాలేదు. దీనిమీద కొంత కాలం ఉండేటప్పటికి స్తబ్ధులం అయిపోతాం. దీనిమీద సంచలనం ఏదీ? ఆ అలలమీద అంతెత్తులేచి పడితే కలిగేఆనందం ఏదీ? మట్టి కాళ్ళకు చుట్టేసుకుంటూ ఏమిటీపాడుదిబ్బ!" అని దాన్ని తిట్టి కొందరు మళ్లీ అలలమీదికి ఉరికారు.

కాని మిగిలినవారు—వీరికి శక్తియావత్తూ ఉడిగిపోయింది. సముద్రంలో ఆడుకునే మనోల్లాసమూ లేదూ, ఆకాశంలోకి ఎగిరేశక్తీలేదు! — ఏమన్నారంటే, "అమ్మయ్య! ఇదేదో చాలా నిరపాయకరమైన ఏర్పాటుచేశాడు భగవంతుడు. మనం ఇక్కడే ఉండిపోదామా ఏమిటి చెప్మా!... అమ్మో! ఆ అలలు చూడు ఎంత భయంకరంగా ఉన్నవో! మనం ఆ సముద్రం చాయల వెళ్లనేవద్దూ!" అన్నారు.

సముద్రంమీద తేలి ఆడుకుంటున్నవాళ్లు ఈ భూచరులను చూసి నవ్వారు. భూచరులకు ఆగ్రహమూ అసూయా కలిగినై.

"మానవజాతి ఈ భయంకరమైన సముద్రంపాలవుతుందనే భగవంతుడు స్వర్గం కల్పించాడు. ఇది క్షేమకరమైనది. మీరు భగవంతుడి ఆజ్ఞను పాలించకపోతే పతితులౌతారు" అని భూచరులు జలచరులతో అన్నారు.

"మీపిల్లి శాపనార్థాలకు మేము భయపడం, పోండి! పిరికిపందల్లారా!" అని జలచరులు ఎగతాళిచేశారు.

ఆకాశమార్గాన తిరుగుతున్న ధీమంతులు రెండుపాట్ల వారినీ గంభీరంగా గమనిస్తున్నారు.

భూచరులను మొదట ఆవహించిన పిశాచం భయం. వీరు తరవాత పొందిన అభివృద్ధి కంతకూ ఈభయపిశాచమే అధిష్టానదేవత.

వారెప్పుడైతే ఒకసారి ఆభయం వాతపడ్డారో, ఇక అప్పటినించీ వారికి ప్రాణాలు సురక్షితం చేసుకునే యావ తప్ప మరొకటిలేదు. ఎండకు, వానకు, చలికి, వేడికి, నీరుకు, నిప్పుకు, వెలుతురుకు, చీకటికి, ఆకలికి, అజీర్తికి—అన్నిటికీ వెరవటం మొదలుపెట్టారు. "క్షేమం!" అదీ వారి ఆలోచన తెల్లవారిలేస్తే.

వారు ఇళ్లుకట్టుకున్నారు. వాకిళ్లు పెట్టుకున్నారు. మళ్లా ఆవాకిళ్ళకు తాళాలు పెట్టుకున్నారు. ఒకరినిచూసి ఒకరు భయపడటం నేర్చుకున్నారు. మధ్య గోడలు పెట్టుకు

న్నారు. ఇంటిలోపలే మళ్ళీగోడలు. ఇంటిచుట్టూ ప్రహారీ గోడలు. మనిషికీ మనిషికీ మధ్య గోడ!

జలచరులు నవ్వారు.

"ఎందుకట్లా నవరంధ్రాలు బిగించుకుంటున్నారు? మీకు దేన్నిచూసి ఆభయం? మీలో మీరు అంతఃకలహాలు కూడా నేర్చుకున్నారేమిటి? ప్రారబ్ధం!" అని వాళ్ళు భూచరులను అడిగారు.

"మేము కర్మ చేస్తూన్నాం. మేము నిర్మిస్తున్నాం. అది మా విధి. భగవంతుడు మమ్మల్ని అట్లా ఆజ్ఞాపించాడు.

"'మీజీవితాలను ఆ జలచరులమాదిరిగా వ్యర్థం చెయ్యకండి. మానవజాతి అభివృద్ధికి అనుకూలంగా నిర్మాణం చెయ్యండి!' అన్నాడు భగవంతుడు.

"ఏమైనా నిర్మించాలంటే ఇక్కడే అవుతుందికాని ఆ అలలమీద ఏమవుతుంది?

"మా జీవితం కొన్నినియమాల ననుసరించి వెళుతున్నది. ఏసమయానికి ఏంచెయ్యాలో మేమంతా ప్రోగ్రాం వేసుకున్నాం. మాకు రేపు అనేదేకాక అనంతమైన భవిష్యత్తు ఉన్నది. మీ పాడుజీవితాలకు ఏమీ లేదు. మరుక్షణం మీరు ఏ అలలమీద తేలుతుంటారో తెలియదు.

"ఆడినంతసేపు ఆడుతారు. మీ శక్తి ఉడిగిపోగానే ఆజీవితప్రవాహం మిమ్మల్ని కబళించేస్తుంది. ఎప్పుడో ఒకప్పుడు మీరంతా జీవితసముద్రానికి బలికావలసినవారే! మీకు క్షేమంలేదు! క్షేమం మాసొత్తు!" అని భూచరులు అనటం మొదలుపెట్టారు.

భయంక్రమంగా జలచరులనుకూడా ఆవహించింది. వారు క్రమంగా ఆదిబ్బమీదికి ఈదుకుని పోసాగారు. కొంతకాలానికి ఆసముద్రం పాడుపడిపోయింది. దానిమీద ఎవరైనా నిలిచి పోయి ఉంటే వారు క్రమంగా అక్కడే నశించిపోయినారు.

మానవజాతిలో ఎక్కువభాగం ఎప్పుడైతే భూచరులుగా మారిపోయినారో అప్పుడు జలచరులు రాక్షసులై పోయినారు.

కాని ఆసముద్రం వాసన మానవరక్తంలో ఉండిపోయింది మానవుడికి ఆ అలలమీద భ్రాంతి పోనేలేదు.

"ఇట్లాకాదు. మనం యింకా గోడలుకట్టుకుందాం. సముద్రం మనకు కనిపించకుండా చుట్టూ ప్రహరీ కట్టుకొందాం. నలుగురు ఒకచోట చేరితే మళ్ళీ ఆసముద్రంమీది భ్రాంతి పైకిరావచ్చును. మనిషికీ మనిషికీ మధ్య గోడలు కట్టుకుందాం. ఎక్కడికీ కదలకుండా మనం సంకెళ్ళు వేసుకుందాం. మనహృదయాలు ఆసముద్రంకోసం పొంగకుండా హృదయాలకు బిగువైన కవచాలు తొడుగుదాం!" అనుకున్నది మానవజాతి.

మనుష్యులు ఆప్రకారమే చేశారు.

"ఇక మనం మనమనస్సులు నిర్మాణంమీదనే ఉంచగలుగుతాం!" అన్నారు మనుష్యులు.

ఇది పెద్ద జైలుఖానాగా పరిణమించింది. ఎవరో ఆమాటే అన్నారు.

"నేనిందులో ఉండను. నాకిక్కడ ఊపిరాడటంలేదు. నాకు స్వేచ్ఛ కావాలి. నాకు గాలి కావాలి. జీవితసముద్రం మీద నేను తేలిపోతాను. ఆసముద్రం ఎక్కడుంది? నాకు

కనిపించదేం? నన్ను చూడనివ్వరేం? నాహృదయం ఒరుసుకుపోతున్నది. ఇది విప్పెయ్యండి. నాహృదయం ఇంకా విశాలంగా పెరుగుతుంది. దాన్ని ఎందుకు పెరగనివ్వరూ? నన్నీ ఆడదానికెందుకు కట్టేశారు? ఈసంకెళ్ళు తెంపెయ్యండి! ఆమాధవికీ నాకూ మధ్య గోడకట్టేశారెందుకు? మేమిద్దరమూ ఆసముద్రంమీద ఆడుకుంటాం!" అని అతను అన్నాడు.

"నీకు తెలీదు, నాయనా! ఆసముద్రం మహాభయంకరమైనది. అది అంటరానిది. అందులో సమస్తమైన భయంకర జంతుజాలమూ ఉంటుంది. నువ్వు నిష్కారణంగా చచ్చిపోతావు! గాలికావాలి, వెలుతురుకావాలి అనకు. అవి నీకు ఆరోగ్యకరాలు కావు. మామాటవిను! ఆమాధవిని నువ్వు సమీపించకూడదు మీఇద్దరికీమధ్య భగవంతుడుకట్టిన గోడ తీసేస్తినా భగవంతుడు నిన్ను భయంకరమైన నరకంలో తోస్తాడు!" అని పెద్దలు అతనితో అన్నారు.

"భగవంతుడికి జాలిలేదా? నేను భగవంతుణ్ణి అయినా మనుష్యుల్ని ఈ బందిఖానాలోపెట్టి ఇట్లాచంపనే! నామాత్రం ఔదార్యం లేదా భగవంతుడికి!" అన్నాడతను.

"వీడు నాస్తికుడు. భగవంతుడు తనకన్నకూడా హీనుడని వాగిస్తున్నాడు!" అన్నారు పెద్దలు.

"ఛీ! మీతో నాకేమిటి? మీ అభిప్రాయాలు నాకు తృణమాత్రం. నేనీగోడలన్నీ ఛేదించుకునిపోతాను. ఈసంకెళ్లు తెంచేస్తాను. ఈ కవచాలు పీకి అవతలపారేస్తాను. నాకు స్వేచ్ఛ

కావాలి. నేను స్వేచ్ఛగా చచ్చిపోవటానికైనా సిద్ధంగా ఉన్నా నంటే నాలో ఆత్మతృష్ణ ఎంతగా ఉందో ఊహించుకోండి!" అని అతను గోడలన్నీ పగలగొట్టుకుని సముద్రంఒడ్డుకు ఒంటరిగా చేరుకున్నాడు.

కాని మాధవిమాత్రం లోకానికి దొరికిపోయింది. జైలు నియమాల ననుసరించి ఆమెకు మిగిలినఖైదీలు ప్రాయశ్చిత్తాదులు చేసి భగవంతుడు ఆమెను క్షమించా డన్నారు.

మాధవి తోడు లేకుండా అతనికి ఆ సముద్రపు అలల మీద ఆడుకు నేటందుకు మనస్కరించలేదు. "మాధవి ఎప్పుడు వస్తుం"దని నిరీక్షిస్తున్నాడతను. ఆమె లేకపోతే ఆ సముద్రం అతనికి పాడుపడినట్లుంది.

అతన్ని చూస్తే నాగుండె తరుక్కుపోతుంది!

* * * *

నాకు వార్ధక్యం వచ్చేసింది. పంచేంద్రియాలూ సరిగా పని చెయ్యటం లేదు. నరాలన్నీ సడిలిపోయినై. జైలునిబంధనలు నన్ను బాధించవు. నన్ను మిగిలినఖైదీలు గౌరవంతో చూస్తారు. నా స్వేచ్ఛకు వారు అసూయపడరు. చిన్నపిల్లలనూ మా ముసలివాళ్ళనూ జైలురూల్సు బాధించవు. అందుకని నేను జైలు నాలుగు మూలలకూ వెళ్ళి ఎక్కడ ఏంజరుగుతున్నదో చూస్తూ ఉంటాను.

ఒకనాడు నేనిట్లా బయలులోకి వచ్చి తలఎత్తిచూచే సరికి ఎవరో గగనమార్గాన తిరుగుతున్నట్లు తోచింది. ఆయన్ను చూచి నేను అక్కడే సాష్టాంగపడ్డాను. ఆయన నాకన్న

చాలాచిన్నవాడు—చప్పున నాపక్కనవాలి "పెద్దలు! మీచేత ప్రణామం చేయించుకో తగని వాణ్ణి!" అన్నాడు.

"నేను వయస్సు పాటించలేదు, స్వామీ! తమరు గగన మార్గంనించి అంతాచూడగలరు. ఆయోగ్యత మాకులేదు. మానవ జీవితాన్ని గురించి తమకుతోచిన దేమిటో సెలవివ్వండి!" అన్నాను.

ఆమహానుభావుడు దీర్ఘంగా యోచించి చివరకు, "భగవంతు డీ ఆకాశమూ, ఈజలరాశీ, ఈభూఖండమూ ఇచ్చాడు. • ఈఆకాశాన్ని అపవిత్రంచేసే సత్తా మానవులకు లేదు. ఈజలరాశిని పవిత్రతాపవిత్రతలు అంటనే అంటవు! కాని ఈభూఖండాన్ని మానవజాతి అపవిత్రం చేసింది.

"అక్కడ అందరికీ అడుగుపెట్టటానికి అర్హత లేదు. మానవజాతిలో ఎక్కువభాగం ఈ అలలమీద ఆడుకోటానికి మాత్రమే అర్హత కలవారు. అది తప్పనే అభిప్రాయం కొద్దిమంది చేరి సృష్టించారు.

"ఆతరవాత అందరూ తాము పవిత్రులమూ అర్హులమూ అనే దురహంకారంతో ఈ భూభాగంమీదికి చేరి, నందనవనాలూ స్వర్గమూ నిర్మించటానికి బదులు ఒక పెద్ద జైలుఖానా తయారుచేశారు!

"ఈజాతి చెడిపోయింది.

"ఆకాశమార్గాన ఎవరూలేరు. సముద్రం యావత్తూ పాడుపెట్టబడిఉంది. దాదాపుజాతియావత్తూ ఈబందిఖానాలో మురుగుతున్నది. ఆబందిఖానాను నిర్మూలం చెయ్యాలి.

"ఈ పంకంలోనించి నూతన శక్తి కొత్త సుగంధమూ పుట్టాలి! పుట్టుతుంది!" అన్నాడాయన.

"స్వామీ, సంసారసాగరము జీవయాత్ర అనే పదాలు ఇంకా మేము వాడుకుంటూనే ఉన్నాం. అవి ఎప్పుడు సృష్టి అయినవో చెప్పుతారా? నాకా మాటలే అర్థంకావటం లేదు!" అన్నాను.

ఆయన నవ్వుతూ సముద్రంవైపు చూపాడు.

"మీరా మాట లెందుకు వాడుతున్నారో నాకూ అర్థం కావటంలేదు. మీలో ఎవరూ అందులో అడుగుపెట్టలేదు సరేకదా దాన్ని సరిగా చూసిఅయినా ఎరగరే!" అంటూ ఆయన ఆకాశమార్గాన ఎగిరిపోయినాడు.

## 3 రాయబారి

"ప్రకాశం?" అని మెల్లిగా కేక. తరవాత సంకోచిస్తూ చేసిన తలుపుచప్పుడు.

భోంచేస్తూ మాణిక్యంతో సరసాలాడుతున్న ప్రకాశానికిగాని, భోజనం పెడుతూ ప్రకాశంతో సరసాలాడుతున్న మాణిక్యానికి గాని ఆ కేకా తలుపుచప్పుడూ వినిపించ లేదు.

ఒక్క పావునిమిషం ఉండి మళ్లీ, "ప్రకాశం!" ఈసారి కాస్త గట్టిగా. కాస్త గట్టిగానే తలుపుచప్పుడుకూడా.

"ఉండు! ఉండు! ఎవరో తలుపు తట్టుతున్నట్టున్నారు" అన్నాడు ప్రకాశం ఆలకిస్తూ.

"మీాకే మాట్లాడుతూ నన్ను ఉండమంటారేమిటి? ఇది మరీ బాగుంది! ఓహో!—"

"అబ్బ! నీకు సరసానిక్కూడా వేళాపాళా లేదు— అదుగో ఎవరో తలుపు తట్టుతున్నారు!"

"అవును! అందుకనే భోజనం ముందు కూర్చుని ప్రారంభించాను సరసం!"

"ప్రకాశం? ప్రకాశం!" గట్టిగా తలుపు చప్పుడు.

"ఎవరింట్లో?"

"ఎవరో వచ్చారు. వెళ్లు. తలుపు తీసి, అట్లా గదిలో కూర్చోబెట్టి, పేరేమిటో కనుక్కురా!"

"నేను వెళ్లనమ్మా! నాకోసం వచ్చారని చెప్తారు తరవాత!"

ప్రకాశం సంతోషంతో ఇకిలిస్తూ, "ఇప్పుడు నువ్వు మాత్రం ఏంచేస్తున్నావేం, చెప్పక? నా పేరుపెట్టి పిలుస్తుంటే నీకోసం వచ్చారనటానికి నాకు మతి లేదనుకున్నావా? ... పో, పో! వెళ్లి తలుపుతీసిరా!" అన్నాడు.

మాణిక్యం అయిన ఆలిశ్యంయీావత్తూ కమ్మోసేటందు కన్లే పరిగెత్తుకుంటూవచ్చి గడియతీసి తలుపులు తెరిచి, చప్పున భయపడ్డదానల్లే ఒక్కఅడుగు వెనక్కువేసింది. ఆమె మొహం మీాది చిరునవ్వు తుడిచివేసినట్టు మాయం అయింది. తలుపు తియ్యటంతో తన పని పూర్తిఅయినట్టు మాణిక్యం వెనక్కు తిరిగి నాలుగడుగులువేసి వచ్చి మనిషిని కనీసం కూర్చోనన్నా

పెట్టాలని జ్ఞాపకంవచ్చి, "అట్లాగదిలో కూర్చోండి. భోంచేస్తు న్నారు. వస్తారు!" అని ఎట్లాగో లోపలపడ్డది.

"ఎవరావచ్చింది?" అన్నాడు ప్రకాశం మాణిక్యం వాలకంచూసి ఆశ్చర్యపోతూ.

మెళ్ళు పరుగెత్తివచ్చినదానల్లే శ్వాస ఆడకుండా మాణిక్యం "ఏమో, నేను అడగటం మరచిపోయినాను!" అన్నది.

"దయ్యం చూసినదానల్లే అట్లాఅయినా వేమిటి?... ఎట్లా ఉన్నాడు?"

"ఏమో, పొడుగ్గా సన్నగా ఉన్నట్టున్నారు. నేను సరిగా చూడలేను. నాకెందుకో ఆయన్ను చూడగానే భయం వేసింది!" అన్నది మాణిక్యం, తన భయం తలుచుకొని చిరు నవ్వు నవ్వుతూ.

"కళ్ళజోడుందా?"

"ఏమో!"

"బట్టకట్టుకున్నాడా?"

"ఏమో!"

"కోటు-"

"ఏమో! అబ్బ! నేను సరిగాచూడలేదండీ!"

"కళ్ళు మూసుకున్నావా ఏమిటి? లేక అంత తేరిపార చూడరాని విగ్రహమా?"

"అబ్బ! మెల్లిగామాట్లాడండి! అవతల ఆయనకు విన పడుతుంది!"

"పిచ్చిమొద్దూ! వెళ్ళి పేరడిగిరా!"

"నేను పోను!"

అయిపోవస్తున్న భోజనం త్వరగా పూర్తి చేసి ప్రకాశం ఆదరాబాదరా చెయ్యి కంచంలోనే కడుక్కుని అవతలికి వెళ్ళాడు. తరవాత కాస్సేపటికి మాణిక్యానికి ప్రకాశం "ఓరి గంగాధరం! నువ్వేనుట్రా? మామణిని బాగా బెదరగొట్టావే?" అనటం వినిపించింది. ఆగంగాధరం ఎవరో ప్రకాశం కోసరం ఎందుకువచ్చాడో గ్రహించటానికి వారి సంభాషణ విందామని మాణిక్యం ప్రయత్నంచేసింది కాని లాభం లేకపోయింది. ఎంతమెల్లిగా మాట్లాడినా ప్రకాశంగొంతు వినిపిస్తున్నది కాని, ఆ గంగాధరం గొంతు బొత్తిగా వినిపించనేలేదు. ఆయన అసలు మాట్లాడుతున్న అలికిడైనా లేదు. మాణిక్యం విసిగి భోజనానికి కూర్చున్నది.

"ఏమిట్రా, విశేషాలూ? ఏదో మహత్కార్యం భుజాన పెట్టుకుని వచ్చినవాడల్లే కనిపిస్తున్నావే!" అన్నాడు ప్రకాశం.

"ఏం మహత్కార్యంలే!......నీభార్యతరఫున రాయబారిగా వచ్చాను. ఈరాయబారానికి నిజంగా నేను తగినవాణ్ణికాదు. ఎందుకంటే మీాయిద్దరికీ ఎందుకు చెడ్డదో నే నెరగను. తరవాత, కావటానికి నేను నీభార్యకు పింతల్లికొడుకును అయినప్పటికీ మనిద్దరమూ చిన్నప్పటినించీ స్నేహితులం. మాడ్డోవిశేషం ఏమిటంటే నీభార్య ఉత్త వెకిలి మనిషిఅనీ, అది ఎటువంటి భర్తనూ సంతోషపెట్టగల తెలివితేటలు లేనిదనీ తెలుసు నాకు. నాకు నీమీాదే పక్షపాతం. ఇదంతా మా సుందరంతో స్పష్టంగా చెప్పాను. అయినా అది నన్నే వెళ్ళమన్నది.

"ఇక అది నీతో అనమన్నదేమిటంటే — పొరపాటు తనదేననీ, అజ్ఞానంగా తను ప్రవర్తించినమాట నిజమేననీ ఒప్పుకుంటే తనను మళ్ళా పలుకుతావేమో కనుక్కోమన్నది."

"ఒలికిపోయిన పాలు—"

"పొరపాటు తనదేనని గ్రహించిందనికాదు సుమా! అట్లా తను అంటే నువ్వు దాన్ని చేపట్టుతావా అని. ఇందులో కాస్త తిరకాసున్నది. నువ్వు తనదగ్గిరికి తిరిగివచ్చే షరతుమీద అంటుందన్నమాట, తప్పు తనదేనని!... ఈరాయబారం నేను సరిగా జరపటంలేదేమో! కాని అందుకు నేనేమీ పశ్చాత్తాప పడను. ఏమంటే మాసుందరి ధోరణి ఉందే నాకు చచ్చేటంత కష్టం తెప్పించింది. నేను దానితో అన్నట్టు నీపక్షం వహించి మాట్లాడుతున్నాను. నేను తిరిగివెళ్ళి దానితో చెబుతాను కూడానూ సంధిపొసగకుండా రాయబారం చేశానని! నాకేం భయమా?"

ప్రకాశం నవ్వాడు.

"దాందుంపతెగిరిలే! ఆవిషయంపోనీ! ఎక్కడైనా విరిగినమనస్సు అతకటం ఉందా? నేనూ మణీ చాలా సుఖంగా కాలక్షేపం చేస్తున్నాం. మణి ఇంటర్మీడియేట్ వరకూ చదువుకుందని నేను నా ఉత్తరంలో రాశానుకాదూ? ఈజన్మకు నాకదేభార్య, నేనే దానికి భర్తనూ! ఇప్పుడు తిరిగి నాభార్య దగ్గిరికి వెళ్ళినా దాంతో ఏంమాట్లాడాలోకూడా తెలీదు, ఒట్టూ!"

గంగాధరం తను వచ్చినపని అయిపోయినట్టు దిక్కులు చూడటం మొదలుపెట్టాడు. ఇంతలో ఏదో జ్ఞాపకంవచ్చినట్టు,

"అన్నట్టు మీనాన్నమాత్రం చాలా ఖేదిస్తున్నాడురా! ఆయన కెన్నోరకాల బోధించాను. కాని వేళ్ళతోకూడా పాతుకుని పోయిన అభిప్రాయాలు ఇట్టే పీకివెయ్యాలంటే సాధ్యమా తుందా? చివరకు నావిషయంకూడా చెప్పాను. మనస్సు కల వని భార్యతో కాపరంచెయ్యటం ఏమిటో నాకు తెలుసు నన్నాను. నేను వస్తుతహా కఠినహృదయుణ్ణి కాకపోయినప్ప టికీ నాభార్య చచ్చిపోవటం నాకు చాలా తెరిపి అయినట్ట యిందనీ, మళ్ళీ పెళ్ళి అనేమాట తలపెట్టటానికైనా నాకు దమ్ములేకుండాపోయి నేను పూర్తిగా స్త్రీవిముఖుణ్ణికూడా అయినాననీ అన్నాను......లోకం తొంభై అనుకుంటుంది. వాటికి మనం లక్ష్యపెట్టి మనసుఖం పాడుచేసుకోవటంకంటె పొరపాటులేదు. నువ్వు నిజంగా సుఖపడుతున్నానంటున్నావు కనక——" అన్నాడు.

"సుఖం ఏమిటి? నాకు రవ్వంతయినా చీకూచింతా లేదనుకో. స్వర్గంలో ఉన్నట్టుంది."

"కనక నీ పద్ధతులేమీ మార్చుకోకు——ఇంకొకరికోసం. నిజం ఆలోచిస్తే మనకోసం మారేవారెవరూ లేరు ఈ ప్రపం చంలో. నీ సొంతభార్య ఏంచేసింది చెపుదూ! నీకోసం చిన్న మెత్తయినా మారిందా?"

"ఎబ్బే!"

"అంతే మరి!"

గంగాధరాన్ని చూస్తే ప్రకాశానికి మొదటినించీ ప్రేమే. కాని ప్రకాశం ఆక్షణంలో గంగాధరాన్ని ఎన్నడూ ప్రేమించ లేనంత ప్రేమించాడు. నుర్రొకడైతే తప్పక తన పినతల్లికుమార్తె

వైపే పలుకును, ఇవతలవాడు ఎంత బాల్యస్నేహితుడైనా సరే! గంగాధరం నిజంగా చాలాయోగ్యుడు. నిజం గ్రహించ గలవాడున్నూ!

"ఇక నేను వెళ్ళివస్తామరా, ప్రకాశం. నాపని అయి పోయింది. నీ భార్యతో ఏంచెప్పమన్నావు ?"

"నా జన్మకు కాస్త సుఖపడటమనేది నేర్చుకునేటప్పటికి దానికి అడ్డం తలుగుదామని చూస్తున్నావా ? అని అన్నానని చెప్పు! ...నువ్వు వెళ్ళుదువుగాని లేరా! ఒకరోజుండి పోరాదూ?"

"కాదురా! వెళ్ళాలి. ధాన్యమూ అదీ అమ్మించలేదు. కాస్త పొలమూ పుర్రా చూసుకోవాలి. రైతులనుకూడా మార్చాలి. ఇప్పుడు చేస్తున్నవాళ్ళు మరీ పేచీకోరులుగా ఉన్నారు. మా నాన్నేమో తనచేతిమీదగా కొన్నపొలం తన చేతిమీదిగానే అమ్మలేక చూస్తూచూస్తూ, అప్పు బోలెడంత పెరగనిచ్చాడు. రెండెకరాలు బేరంకూడా పెట్టిరావాలి. మానాన్న పోగానే చెయ్యవలిసింది, పడలేదు. ఈ యేడైనా... నీ యోగక్షేమం రాస్తూఉండు. బండికి వేళ అవుతున్నది. వస్తానురా, ప్రకాశం!" అని గంగాధరం లేచాడు.

"సరే, మంచిది! ... నిన్ను చూడటం నా కెంతో సంతోషంగా ఉందిరా, ప్రాణం లేచివచ్చిందన్నమాట!"

మాణిక్యం భోంచేసి వచ్చేటప్పటికి గంగాధరం వెళ్ళి పోయినాడు. ఆమె కేమాత్రమో ఆశాభంగమయింది!

ప్రకాశం పెట్టిన రెండునెలలసెలవూ అయిపోవస్తున్నది. మాణిక్యాన్ని తనవూరు ఎట్లాగా తీసుకుపోవటం, ఏంచెయ్య

టమా అని అతను మథనపడుతూండగానే శుభవార్త వచ్చింది తన ఉద్యోగం ఊడిందనీ, తనస్థానే పనిచేస్తున్న అతన్ని ఆఖాళీలో ఖాయపరిచారనీ.

ఆమాట వినగానే మాణిక్యం దిగులుపడ్డది.

"ఆఉద్యోగం నాకు మామీనమామగా రిప్పించాడు. తీసివేయించటం కూడా ఆయన కట్టుకున్న పుణ్యమే అయివుంటుంది. పోనీలే, పీడ విరగడఅయిపోయింది. మానాన్న నడిగి డబ్బు తెప్పించుకుంటాను," అన్నాడు ప్రకాశం.

అతను తండ్రికిరాసిన ఉత్తరానికి మూడోనాడే సమాధానం వచ్చింది.

"నువ్వు చేసినపనికి తల ఎత్తుకుని తిరగలేక చస్తున్నాను. నిన్నూ నీబోగందాన్నీ డబ్బుకూడాఇచ్చి పోషించమంటావా? ఇంకా పెళ్ళికావలసిన చెల్లెళ్లు ఇద్దరున్నారు నీకు, నేను నీకు ఎంతడబ్బు పంపగలననుకున్నావు? వాళ్ళిద్దరి పెళ్ళిళ్లుకూడా వదిలేసి నీభాగం ఎంతవస్తుందో అంతా నువ్వు పంచుకోవటానికి నాకు ఎటువంటి అభ్యంతరమున్నూ లేదు," అని తండ్రి సమాధానం రాశాడు.

"ఆముసలి ప్రాణాన్ని ఎందుకు కష్టపెడతారు? మా అమ్మ దాచిపెట్టి నాకిచ్చినడబ్బు ఎనభై రూపాయలింకా నా దగ్గిరే ఉన్నై. అవి ఖర్చుపెట్టుతూ ఉందాం. ఈలోపల మీరు మళ్లీ ఏదైనా ఉద్యోగం చూడండి!" అన్నది మాణిక్యం.

ఆడబ్బు నెలాపదిహేనురోజుల్లో అయిపోయింది. ప్రకాశానికి ఉద్యోగం దొరకలేదు. అసలు అతను ప్రయత్నమే చెయ్యలేదు.

"పిచ్చిదానా, చేసినా ఉద్యోగం దొరికేదికాదు. నా మాట నమ్ము. ఈరోజుల్లో ఉద్యోగమంటే మాటలా?" అన్నాడతను.

మాణిక్యానికేమో కాస్తకష్టం వేసింది. ప్రకాశం అశ్రద్ధ ఆమెకు రుచించలేదు. కాని ఆవిషయమై మాణిక్యం చూసీ చూడనట్లు ఊరుకున్నది. పాపం ఆ ఎనభైరూపాయలూ సంవత్సరంనించీ ఎంతో భద్రంగా దాచిపెట్టింది. ప్రకాశం వాటిని గవ్వలలేమార్చి, అది మాణిక్యం ప్రాణపదంగా దాచుకున్న డబ్బని ఒక్కరవ్వయినా ఆలోచనలేకుండా, గోల్డుఫ్లేకు సిగిరెట్లకిందా, జట్కాబళ్లకిందా, సినమాలకిందా ఖర్చు పెట్టేశాడు.

తనమనస్సు చివుక్కుమనటం ఎందుకో మాణిక్యంఅర్థం చేసుకోలేకపోయింది. ప్రకాశం తమయిద్దరికిందా దాదాపు రెండువందలు ఖర్చుపెట్టాడు. తన ఎనభైరూపాయలు ఖర్చయితే ఏం? తనమనసులో ఏకోశానో నీచత్వం ఉన్నదనుకుని మాణిక్యం సిగ్గుపడ్డది.

"ఒక్కపని చేస్తాను!" అన్నాడు ప్రకాశం. "గంగాధరానికి రాస్తాను. నేనేదైనా ఏర్పాటు చేసుకునేదాకా వాడు మనకు కావలిసింది ఇస్తాడు!"

ఆనాడే ప్రకాశం గంగాధరానికి ఒకకవరు రాసి పడేశాడు. అతనిదగ్గిర్నించికూడా మూడోనాటికే సమాధానం వచ్చింది.

"రేపు సోమవారంనాడు నీపేర నూరురూపాయలు నూన్యరు చేస్తున్నాను. నువు ఇబ్బందిలో ఉన్నావని తెలిసి

నాకు చాలా కష్టంగా ఉంది. రోజులు మనవి కానప్పుడు అంతా విరోధు లవుతారు — భగవంతుడుకూడా. ఈ డబ్బు జాగ్రత్తగా వాడుకుంటే హీనంగా రెండు నెలలవరకూ సరి పోతుంది" అని రాశాడు గంగాధరం.

మర్నాడు వందరూపాయలూ వచ్చినై. ప్రకాశం ఉత్సాహానికి మేర లేదు.

"పిల్లా! ముందు ఒక గోల్డుఫ్లేకుపెట్టె తెప్పించు!...... అదుగో, ఆబత్తాయికాయలు పిలు. రెండు డజన్లు పుచ్చు కుందాం!"

మాణిక్యానికి ప్రకాశం ప్రవర్తన వెగటుగా తోచింది. ఈసారి అతన్ని నిరసించటానికి తన నైచ్యంతో ఏమీ సంబంధం లేదు. ఆడబ్బు తనదికాదు. ఇంకొకరిడబ్బు ఖర్చుపెట్టేటప్పుడు "ఈడబ్బు మనదికాదే!" అని కొంచెం ఉండకూడదా? పాపం, ఆయన, ఆగంగాధరంగారు దేవుడల్లే సమయానికి అడ్డుపడ్డాడు కనక సరిపోయింది! లేకపోతే ఏపూట పస్తుపడుకోవలసి వచ్చేదో!

మూడుసార్లుగా మూడువందలు పంపాడు గంగాధరం.

ప్రకాశానికి ఉద్యోగం లభించనేలేదు—దానంతట అది!

గంగాధరానికి మళ్ళీడబ్బుకోసరం రాయవలిసివస్తుందా ఏమిటి అని ప్రకాశం భయపడుతుండగా గంగాధరందగ్గిరించి అందరిగుండెలూ నీరుచెయ్యాజాలిన ఉత్తరం వచ్చించి.

"ప్రకాశం — నా అజాగ్రత్త నా కొంప నిలువునాతీసేసింది. అకస్మాత్తుగా పోలాలధరలు పడిపోయినై. ఈ రోజున

నా ఆస్తికీ అప్పుకూ సరిపోతుంది. ఏనాడు నాకీ మున్ఫైఅయిదు రూపాయల ఉద్యోగమూ ఊడిందో ఆనాడు నేను చిల్లిగవ్వకు మారను.

"పాపం, నామీద ఇంత కాలమూ ఆధారపడి, వేరేదిక్కు లేకుండా ఉన్న మీరు ఏమవుతారు?—గంగాధరం"

ఆ ఉత్తరం చదివి మాణిక్యం దుఃఖం ఆపుకోలేక పోయింది. తనకోసరం కాదు, ప్రకాశంకోసరమూ కాదు, ఆగంగాధరం కోసరం ఆమె హృదయం ద్రవించడం మొదలు పెట్టింది. ఆ సమయానికి ప్రకాశం ఇంట్లో లేడు కనక సరిపోయింది. పోతే తనదుఃఖం అతనికి అర్థమయ్యేది కాదు. ఆ అర్థం విప్పిచెప్పటం ఆమెకు చాతనయ్యేదీ కాదు!

ఈ అమాయకుణ్ణి చూసి తను ఎట్లా దడుచుకుంది! అతని మొహమైనా తను స్పష్టంగా చూడలేదు.

గంగాధరం రాసిన ఉత్తరం చూసికూడా ప్రకాశం డబ్బుకోసరం—ఒక్క పాతికకోసరం, కనీసం పదిహేనుకోసరం—ఉత్తరం రాశాడు! అందులో ఒక బొంకుకూడా బొంకాడు, తనకు ఉద్యోగం అయేలక్షణాలు కనిపిస్తున్నవని. ఆ ఉత్తరం మాణిక్యం బలవంతాన చదివింది. "ఇది నిజంగా పోస్టులో వేస్తారా ?" అన్నది మాణిక్యం.

వారి జన్మల్లో మొదటిసారీ చివరసారీ ఆఉత్తరంగురించి కాస్త తీవ్రంగానే ఆ యిద్దరూ పోట్లాడుకున్నారు. అతను దాన్ని పోష్టులో వెయ్యటానికి వెళ్ళగానే ప్రకాశంపేర ఒక ఉత్తరం వచ్చింది. దానిమీది నల్లమరకలు మాణిక్యానికి అర్థంకాలేదు.

పోస్టాఫీసునుంచి తిరిగివచ్చి ప్రకాశం ఆ ఉత్తరం చించి చూసుకున్నాడు. కొంత చదివి అతను నిట్టూర్పు విడవటం మాణిక్యం గమనించింది. పొంతంగా చదివినతరవాత అతని కళ్ల లోకి ఒకవిధమైన వెలుతురూ, తీర్మానమూ రావటంకూడా గమనించింది.

ఆ ఉత్తరం తెచ్చిన అశుభవార్త ఇదీ.

"మా అన్నయ్య నిన్నరాత్రి అకస్మాత్తుగా చనిపోయి నాడు. చెట్టంత కొడుకుపోతే మా అమ్మా నాన్నా దుఃఖం పట్ట లేకుండా ఉన్నారు. వాళ్లు ఏడుస్తుంటే మేము చూడలేకుండా ఉన్నాము. ఉన్న ఒకకూతురూ ఇట్లాకావటం. ఒక కొడుకూ అట్లాకావటం. ఇంతకూ వాళ్లరోజులు మంచివికావు. మీరు నన్ను క్షమించినా క్షమించకపోయినా నేను మీ విషయంలో ఎంత బుద్ధిలేకుండా ప్రవర్తించానో తెలుసుకున్నాను. నా విషయం అట్లా ఉండగా మా అమ్మానాన్నలకు అల్లుడైనా కొడుకైనా ఇక మీరేకనక వాళ్లయందైనా కరుణించి మీరు ఈ ఉత్తరం అందినవెంటనే రావలిసింది—సుందరి."

మొదట్లో ప్రకాశం తనతండ్రిని గురించిన విషవార్త ఏమైనా ఉత్తరంలో ఉందేమోనని గాభరా పడిపోయినాడు. ఆసంశయం వెంటనే తీరిపోయింది. మిగతా ఉత్తరంలో తనకు శుభవార్తే. భార్య చిట్టచివరకు తనతప్పు ఒప్పుకోవలసిన తీరుగా ఒప్పుకున్నది. తన బావమరిది పోవటాన్నుంచి తను పదిహేనెకరాల సుక్షేత్రమైన యానాం మాగాణీభూమికి హక్కుదారవుతాడు. ఇక తను ఉద్యోగం చూడవలసిన పీడ కూడా వుండదు.

కాకపోతే మాణిక్యం విషయం! తీరికగా మాణిక్యం విషయం ఏకో చెయ్యాలి. బహుశా మాణిక్యాన్ని తను వదలుకోవలిసి వస్తుందేమో! మళ్లా గౌరవనీయమైన సంఘంలో పడితే ఈతగలాటం తనకు ఎట్లా వీలవుతుంది? అయితే మంచిదే. కాకపోతే తను మాణిక్యాన్ని వదుులుకోవలిసి వస్తుంది!

కాకపోయినా మాణిక్యం తనమీద అధికారం చలాయించుదామని చూస్తున్నది అప్పుడే! ఏముంది? ఏజాతి కాబుద్ధి!

"మా బావమరిది పోయినాడు. నేను అర్జంటుగా వెళ్లాలి. నువ్వు ఒక్కత్తెవూ ఉండలేవా? ఈపదిరోజులూ రావటానికి వీలుపడదేమో!"

"పాపం! వెళ్లిరండి!" అన్నది మాణిక్యం, అతనిమీద తనకు అంతకు పూర్వమే కలిగిన కోపం యావత్తూ మరిచి పోయి.

ప్రకాశం వెళ్లి ఇరవైరోజులు కావస్తున్నది. అతని దగ్గరనించి ఉత్తరం లేదు. అతను అసలే లేడు.

తన్ను ప్రకాశం వంచించా డనుకోలేక పోయింది మాణిక్యం, ఒకచెంప తన అంతరాత్మ నొక్కి చెప్పుతున్నా. ఆ ఆలోచన హృదయంలో పదే పదే తట్టుతుంటే, "నేనింత నీచురాలనయి పోతున్నానేమిటి?" అనుకున్నది.

ఆమె కప్పుడే ప్రకాశం వెళ్లి ఒకయుగం అయినట్టున్నది. ఇంటిముందుగా ఏబండి వెళ్లినా, గడపముందు ఏమాత్రం అలికిడి అయినా ఆమె చెవులు రిక్కించి వినేది. వీధిలో ఎవరు

ఎవరివాకిలి తట్టినా ప్రకాశంవచ్చి తనవాకిలి తట్టినట్టే అయేది. ఆమెకు తిండిమీద కూడా ధ్యాసలేకుండా పోయింది. ఒక పూట వండుకుంటే ఒకపూట వండుకోక అశ్రద్ధగా ఉండటం మొదలుపెట్టింది.

ఒకసారి నిజంగా ఎవరో తలుపుతట్టారు. ఎంతో ఆదుర్దాతో వెళ్ళి తలుపుతీసింది. ఇంటాయన అద్దె అడగటానికి వచ్చాడు. తాత్కాలికంగావచ్చినప్రాణం కాస్తానశించిపోయింది. ఆమె అప్పటికి భోంచేసి అరువై గడియలైంది—అదికూడా ఏం వేసుకుని తిన్నదో!

"వారు ఊళ్లో లేరు. రాగానే ఇస్తారు!" అని చెప్పి ఇంటాయన్ను పంపేసి మాణిక్యం వంటచేసేటందుకూ్కడా సత్తువ లేక మంచంమీద ఒరిగింది.

సహం వళ్లు తెలిసీ సహం తెలియకుండా ఆమంచం మీద అట్లా పడుకుని, "ఇదంతా నాకు అతడిమీదప్రేమే?" అని ప్రశ్నించుకుని తనలో తను నవ్వుకుంది. ఆతరవాత ఆమెకు స్పృహ తప్పింది.

ఎవరో తన మంచందగ్గిర నిలబడ్డారు...లోపలికి ఎట్లా వచ్చారో!... కళ్లు తెరిచి చూసేటందుకూ్కడా ఓపిక లేదు. మళ్లీ మైకం వచ్చేసింది.

అకస్మాత్తుగా తన శరీరంలో జీవం ప్రవేశించినట్టయింది. కళ్లు తెరిచి చూడగలిగింది. ఆగంగాధరం! అతని చేతులో మంచినీళ్ళ గ్లాసుంది. ఆమె అప్రయత్నంగా నోరు తెరిచింది.

అతను మరికాసిని నీళ్లు ఆమెనోట్లో పోశాడు. ఎండిపోయిన ఆమె గొంతు కానీళ్లు అమృతంమాదిరిగా తగిలినై.

"బయటివాకిలి దగ్గరిగా వేసిఉంది. నువ్విట్లా ఒళ్లు తెలియకుండా పడిఉన్నావు. ఏదో ప్రమాదం జరిగిం దనుకున్నాను."

"ఇట్లా ఉంటుందా ఈయనగొంతు!" అనుకుంది మాణిక్యం అసందర్భంగా.

"వంటఇంట్లో ఎక్కడివక్కడ పారేసి ఉన్నై... నువు వంట చేసుకుని ఎన్నిరోజు లైందీ?"

"ఏమో, జ్ఞాపకం లేదు."

"తిండిలేక శోషించింది... ఎందుకట్లా చేశావు?"

"పొగరు! బద్ధకం!" ఆ రెంటికీ చాలా దగ్గర బాంధవ్యమల్లే!

"నేను ఆవంటిల్లు కాస్త బాగుచేసి వంటచేస్తాను."

"మీరా?"

"అవును. నేనే వంట చేసుకొంటాను. నాకు చేసిపెట్టే వాళ్ళెవరూ లేరు. హోటలుతిండి నాకు సరిపడదు."

ఆమె మళ్లీ కళ్ళు మూసుకున్నది. చక్కని నిద్ర పట్టింది.

అతను మళ్ళీవచ్చేటప్పటికి ఆమె గాఢనిద్రలో ఉంది. ఆమెను ఎట్లా లేపాలో అతనికి తెలియలేదు. "ఇదుగో!" అని చూశాడు కాని లాభం లేకపోయింది. పైగా చచ్చిపోయిన తనభార్య జ్ఞాపకం వచ్చింది. ఇక పేరుపెట్టి పిలవక తప్పిందికాదు.

"మాణిక్యం!"

పిలుపు అనలేదు.

కొంచెం గట్టిగా "మాణిక్యం!"

మాణిక్యం కళ్ళు తెరిచి బలహీనంగా నవ్వి "అంత పొడుగున నన్నెవ్వరూ పిలవరు! మణి అనండి చాలు!" అన్నది.

"ఇదుగో! ఇవి తినుముందు. తిని కాసిని నీళ్ళు తాగు. ఒక్కసారిగా భోంచేస్తే వికమిస్తుందేమో!"

"ఏమిటవి?"

"ఏదో తీపిసరుకు, హోటలునించి తెచ్చాను."

"ఎందుకు పడుతున్నారండీ ఈఅవస్త అంత్తానూ!"

"ఎట్లామరి?"

మాణిక్యాన్ని గంగాధరం మంచంలో లేపి కూర్చోబెట్ట వలిసివచ్చింది. అతను తెచ్చిన పదార్థాలు తిని కాసిని మంచి నీళ్ళు తాగి మాణిక్యం "ఇక నేనేమీ తినలేను. నాకు వంట చెయ్యకండి" అన్నది.

"వంట అయిపోయింది. సయించినంత తిను. నీయిష్టం వచ్చినప్పుడే కానీ!" అన్నాడు గంగాధరం.

"చీకటిపడ్డటుంది. కొంచెం లాంతరు వెలిగించండి." అతను లాంతరు వెలిగించాడు.

"మీరు భోంచెయ్యండి."

"అప్పుడే తొందరలేదు. నీకుకూడా ఆకలికానీ!"

"అమ్మో! నాకిక తిండివద్దు. నేను తోడుకూర్చుంటాను. మీరు భోంచెయ్యండి."

"నేను భోంచేస్తానులే. నువు తోడక్కర్లేదు. అప్పుడే నువు లేచి నిలబడగలవా?"

"ఓ!" అంటూ మాణిక్యం లేచి నిలబడబోయి తూలి సమయానికి అతను అందించిన చెయ్యి పట్టుకుంది. "సత్తువ

మెల్లిగా వస్తున్నది." అన్నది నిబ్బరంగా నడవాలని ప్రయత్నం చేస్తూ.

"అట్లా కాస్సేపు కుర్చీలో కూర్చో. నేను భోంచేసి వస్తానుపోనీ!" అంటూ అతను ఆమెను ఒక ఈజీచైరులో కూర్చోబెట్టి తను ఒంటరిగా భోజనం చెయ్యబోయినాడు. కాని ఆమె అతని భోజనం పూర్తికాకపూర్వమే వంటఇంట్లోకి వచ్చింది.

"పోనీ నేనుకూడా కాస్త రుచిచూస్తాను మీావంట," అన్నది మాణిక్యం.

కాని ఆమెకు తిండి లోపలికి పోలేదు. ఇద్దరూ ఒక్క సారే భోజనం పూర్తిచేశారు.

"అవన్నీ అట్లా ఉంచండి. రేపు నేను బాగుచేస్తాను!" అని ఆమె అతన్ని నిర్బంధించింది.

ఇద్దరూ ఇవతలికి వచ్చి చెరొక కుర్చీలోనూ కూర్చు న్నారు. పడకకుర్చీలో తను కూర్చోనని మాణిక్యం మొండి తనం చేసింది. అతనే దానిలో కూర్చున్నాడు.

ఇద్దరూ అయిదునిమిషాలు అట్లా మౌనంగా కూర్చు న్నారు.

"నేను వచ్చి నాలుగైదు గంటలయినట్టుంది. నేను మోసుకొచ్చిన వార్త ఇంకా బయటపెట్టలేదు. నువ్వూ అడగ లేదు ప్రకాశంసంగతి," అన్నాడు గంగాధరం.

"శుభవార్తఅయితే మీారప్పుడే చెప్పేవారు. కాదేమో

వనే అడగకుండా ఊరుకున్నాను. ఎప్పుడైనా వినవలిసిందే! చెప్పండి," అన్నది మాణిక్యం.

"ఈ ప్రకాశం నా కర్థంకావటంలేదు!" అన్నాడు గంగాధరం తనలోతను మాట్లాడుకుంటున్న వాడల్లే. "నేనువాణ్ణి బాగా ఎరుగుదు ననుకున్నాను...ఎవరోఅన్నట్లు, మనం ఎంత బాగా ఎరిగినమనిషిఅయినా ఆడదాని దగ్గిరికి వచ్చేటప్పటికి ఎట్లా ప్రవర్తించుతాడో చెప్పలేమన్నది నిజమేనేమో!... వాడికీ భార్యకూ చెడ్డది. తన తప్పేనని ఆ భార్యకూడా ఒప్పుకున్నది. తీరా విచారిస్తే ఏమీలేదూ! వట్టి చిన్నతనపుతగూ. తండ్రి నడిగి వెయ్యిరూపాయలు తన కిప్పించమన్నాడుట ప్రకాశం తన భార్యను. అదివరకు కట్నంరూపంగా తీసుకున్నది చాలదా అన్నదిట భార్య. ఆ భార్యను వదిలిపెట్టేశాడు! ఇప్పుడు మళ్లీ నీ విషయంలో... అయితే మీ యిద్దరికీ మనస్సులు కలవలేదన్నాడు. నిజమా?"

ఈ మాటలన్నీ తలవంచుకుని వింటున్న మాణిక్యం తలయెత్తి, "నాకు తెలిసినంతవరకు ఒక విషయంలోనే అట్లా జరిగింది. దేవుడివంటి ఒక స్నేహితుడితో ఆయనను అబద్ధం ఆడటానికి అభ్యంతరం లేకపోయింది. నా మనస్సుకది కష్టంగా తోచింది! అంతే మా యిద్దరికీ కలిగిన అభిప్రాయభేదం!"

"చూశావా?" అన్నాడు గంగాధరం, నేననుకున్నంతా అయిందన్నట్లు. "తనూ భార్యా మళ్లీ కలిసినసంగతి నీతో చెప్పమనీ, నీకు డబ్బుఏర్పాటు ఏదో చేస్తానని చెప్పమనీ, ఈ లోపుగా ఎట్లాగైనా నాలుగురోజులు ఓర్చుకోమని చెప్పమనీ

నన్ను పంపించాడు. నీకు అర్జంటుగా కావాలంటే నన్నే ఏదైనా ఇవ్వమన్నాడు. నాదగ్గిర ఇరవైరూపాయలు మాత్రం ఉన్నై!"

"ఇంకా మా మొహాన ఎంతడబ్బు పెడతారండీ! ఇప్పటికే మీసొమ్ము మూడువందలు తినివున్నాం. నా మెడలోవీ చేతులవీ నగలు రేపు అమ్మకం చేస్తాను. మీమూడు వందలూ మీరు తీసుకోండి. ఆ తరవాత నన్నెవరూ పోషించ నక్కర లేదు. కథలో నక్క మాదిరిగా అందని పళ్ళకు అర్రులు చాచాను కాని నేను బోగందాన్ని కానా? నాకు నావృత్తి లేదా? రెండుసార్లు మోసపోయినాను. ఇంకొకసారి మోస పోతానా?"

మాణిక్యం పట్టలేక ఏడవలం మొదలుపెట్టింది.

"ఆడబ్బు నువ్వెందు కివ్వాలి? నేను ప్రకాశాన్ని చూసియిచ్చానా, నిన్నుచూశా? పైగా నేను అది తిరిగి పుచ్చుకోవాలని ఇవ్వలేదు. నాకా గడవకపోదు, నెలకు ఇరవై చాలు. నాజీతంలో పదిహేను రూపాయలు హీనంగా మిగుల్చుకోగలను. అదిగాక అయిదురూపాయలు మా యింట్లో భాగానికి అద్దెకూడా వస్తుందీ!"

మాణిక్యం ఏడుపుమాత్రం మానలేదు.

"నువ్వేట్లా ఏడవకు, మాణిక్యం, నేను చూడలేను!"

మాణిక్యం తనదుఃఖాన్ని దిగమింగి కళ్ళు తుడుచుకుంటూ "నిస్సత్తువచేత ఏడుపుకూడా స్వాధీనంలోకి రాకుండా ఉంది. లేకపోతే మీచేత అడిగించుకోను, ఏడుపుమానమని!" అన్నది.

బుద్ధితక్కువై ఏమెపు మానమన్నాననుకున్నాడు గంగాధరం.

రెండు మూడు నిమిషాలు ఇద్దరికీ ఏమిమాట్లాడేటం దుకూ లేక పోయింది.

"అదికూడా కాదు!" అన్నాడు గంగాధరం. "నాకా శ్చర్యమేమిటంటే, ఆపేక్షలూ అంతఃకరణలూ కర్మను అను సరించి రావచ్చును, పోవచ్చును. అందుకు బుద్ధిమంతుడు సిగ్గు పడతాడా? తనకు నీమీద ఆపేక్ష కలిగింది! సిగ్గుపడ్డాడా? నీతో కాపరం చెయ్యలేదూ? ఆ ఆపేక్షపోయింది! నీతో ఆమాట స్వయంగా అనరాదూ? ఉత్తరం రాయటాని క్కూడా మొహం చెల్లదుట! నన్ను తేమాడు. నే నప్పుడే అన్నా 'నీమనసులో ఏదోకల్మషంఉంది. లేకపోతే ఆ మొహం చెల్లకపోవటమనేది కలగదు!' అని" అన్నాడు గంగాధరం.

"ఒకరిసంగతి ఎందుకులెండి. ఇందులో నాబుద్ధి పొర పాటు బోలెడుంది. నాకులానికి తగినవృత్తి, ఆవృత్తికి తగిన విద్యా మానేసి, తగుదునమ్మా అని నేను ఇంగ్లీషు చదువుకు పోయినాను. ఆచదువులో పడ్డప్పటినించీ అందరిమాదిరిగా నేనుకూడా ఇల్లాలిని కావాలని, ప్రేమ అనుభవించాలని! నాకు బాగాదొరికాడు మామామయ్య. మాఅమ్మ ఏదో ముల్లె పాతిపెట్టిందని ఆశపడి అతను పెళ్ళాడతానని అనీ అనీ, నన్ను తనదగ్గర ఆరునెలలు అట్టేపెట్టుకుని, చివరకు మాఅమ్మ పాతిపెట్టినబండారం బయటపడగానే నాతోవ నన్ను చూసు కోమన్నాడు.

"మామామయ్యా ప్రకాశంగారూ పట్టణంలో కలిసి చదివారు కాలేజీచదువు. అప్పుడీయనకూ నాకూ కొద్దిగా పరిచయం. నేను పట్టణంనించి వస్తుండగా మధ్యస్టేషనులో నా పెట్టెలోకే ప్రకాశంగారు ఎక్కారు. నాకష్టాలన్నీ ఆయనతో మొరపెట్టుకున్నాను. ఆయన ముందూ వెనకా ఆలోచించకుండా 'మనిద్దరం పెళ్లిచేసుకుందాం!' అన్నారు. నాకు ఆశ పుట్టింది. ఆశపడ్డందుకు భగవంతుడు గట్టిగా చెంపలు వాయించాడు!"

మళ్ళీ అయిదారు నిమిషాలపాటు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు.

"అయితే నీముందు గతేమిటి?"

"దాన్నిగురించి ఇప్పుడాలోచించ బుద్ధి పుట్టటంలేదు. జీవితంలో ఒక్కొక్క సమయం వస్తుంది—అట్లా జీవితం యావత్తూ జరిగితే మనకు అభ్యంతరం ఉండనవసరంలేని సమయం. ఇప్పుడటువంటి సమయం వచ్చింది. రేపు గురించి ఆలోచిస్తూ ఈక్షణం ఎందుకు పాడుచేసుకోవాలీ? రేపు మీరు వెళ్లినతరవాత నాముందుగతిని గురించి ఆలోచించటానికి బోలెడంత వ్యవధి ఉంది!"

"ప్రకాశంసంగతి చెప్పగానే మండిపోతావనుకున్నాను...నాకింకా అర్థంకాలేదు. నువ్వు వాడికోసరమేగదా భోజనంకూడా మానేసి శోషించింది, వాడిసంగతి చెప్పగానే మొదలు నరికిన చెట్టల్లే ఎందుకు పడలేదో!"

"నేను అంతనిర్లక్ష్యం చేసింది ఆయనకోసంకాదు. ఆయన రారని వారంరోజులకిందటే రూఢిచేసుకున్నాను. జీవి

తంలో నేనుపెట్టుకున్న గురులు రెండూ ఈజీవితానికి లేకుండా పోయినై — పెళ్ళి, ప్రేమా! జీవితంమీదే విరక్తి పుట్టింది!"

"మళ్లీనేను వెళ్ళగానే ఈవిధంగానే భోజనం మానేసి పస్తుపడుకుంటావా ఏమిటి?"

"ఏం పడుకుంటే?" అన్నది మాణిక్యం నవ్వుతూ.

"అట్లా చెయ్యనని వాగ్దానం చెయ్యకపోతే నేనిక్కణ్ణించి వెళ్లనే వెళ్ళను!"

"మీరు వెళ్ళకపోతే నాకభ్యంతరమునా? మీతో గడిపిన ఈకాస్సేపూ ఉన్నట్టు నాజీవితంలో నాకెన్నడూ లేదనుకుంటాను!"

గంగాధరం ఆ మాటకు ఏంచెప్పాలో ఆలోచించలేక పోయినాడు. కాస్సేపు మాణిక్యంవంక అట్లాగే చూస్తూ కూర్చుని అతను అకస్మాత్తుగా, "ప్రకాశం తన మనస్సులో భావాన్ని పైకి ప్రకటించటానికి సిగ్గుపడ్డందుకు ఇంతకుముసుపే తప్పుపట్టి నా మనస్సులో భావం నేనెందుకు దాచిపెట్టాలి?... మాణిక్యం, నాకు భార్య వవుతావా?" అతనిగొంతు కొంచెం చలించింది. "నేను బీదవాణ్ణి నలభైరూపాయలమీద ఇద్దరు మనుష్యులు బతకవచ్చుననుకో! అయినా కాలూ చెయ్యీ ఆడదు. నువు సుఖానికి అలవాటుపడిన ప్రాణం కావచ్చును!"

మాణిక్యం అతనిమాటలు అర్థంచేసుకోనట్టు అతనివంక పెద్ద కళ్లుచేసుకుని నిశ్చలంగా చూడటం మొదలుపెట్టింది.

"నేనా సుఖానికి అలవాటుపడిన ప్రాణిని!" అని అసందర్భంగా, "నేను మిమ్మల్ని ఆకర్షించాలని ఏమైనా ప్రయత్నం చేశానా — నాకు తెలియకుండా!" అన్నది మాణిక్యం.

గంగాధరం నవ్వాడు.

"నీ కటువంటి భయం ఏమీ అక్కర్లేదు నువ్వెటువంటి ప్రయత్నంచేసినా నేను తెలుసుకోలేను. నేను రసికుణ్ణికాను. నా భార్య ఎప్పుడూ ఆమాటే అనేది!"

"మీరిప్పుడు నన్ను మీ భార్యకమ్మనేనా అడిగారు?" అన్నది మాణిక్యం, దాదాపు కావాలని అడుగుతున్నట్టుగా.

అయితే ఆమె ఆశ్చర్యం అతనికి కృత్రిమంగా కనిపించలేదు. "అవును!" అన్నాడతను.

"ఎందుకంటే, మొదట నేను వేశ్యను — మీ రెండు దురు! తరవాత నేను ఇద్దరికి ఉంపుడుకత్తెనుగా ఉన్నాను. రెండుసార్లూ నా భార్యాత్వం జయప్రదంకాలేదు... మళ్లీ ఆరు నెల్లు!" అన్నది మాణిక్యం అక్కడక్కడా ఇంగ్లీషుమాటలు కూడా ఉపయోగించి మాట్లాడుతూ.

గంగాధరం కూర్చున్నచోటినించి లేచివచ్చి ఆమె చేతులు తనచేతుల్లోకి తీసుకొని "కాదు, మాణిక్యం! నిన్ను నేను పెళ్లిచేసుకుంటాను ఎట్లాగో నేను నిన్నిట్లావిడిచిపెట్టి వెళ్ళలేను. నువ్వేమవుతున్నావో అని నా మనసు బాధిస్తూనే ఉంటుంది," అన్నాడు.

మాణిక్యం బలహీనంగా నవ్వి, "ఆ దౌర్బల్యం మీలో లేకపోలేదు. అందుకనే నాలుగునెలలనుంచీ నన్నూ మీ స్నేహితుణ్ణికూడా పోషిస్తున్నారు. కడుపునవున్న పిల్లలనల్లే! నాకోసం మీరు జాలిపడటం నాకు సంతోషమే కానివ్వండి, మీకు అందువల్ల చాలా ముప్పున్నది. నావంటివాళ్లు ప్రపంచం మీద కట్టుకుపోయినంతమంది ఉన్నారు. వాళ్లందరికోసమూ

మీారు"—అని ఏదో అనబోతుండగా గంగాధరం కొంచెంవంగి ఆమె చెంప ముద్దు పెట్టుకున్నాడు.

"నాలో ఏంచూసి మీారు నన్ను ప్రేమిస్తున్నారో నాకర్థం కాలేదు," అన్నది మాణిక్యం.

"నాకూ అర్థంకాలేదు, కాని తెలుసుకోవాలని నాకు లేదు. అంతే మనిద్దరికీ భేదం.

"నాగుండె ఇలాగాడు ఎట్లా కొట్టుకుంటున్నదో! అది అబ ద్ధంఆడుతుందా?"

మాణిక్యం అనుమానిస్తూ అతనిగుండెమీద చెయ్యి వేసి "అమ్మో" అన్నది.

"ఇంకేమిటి నీఅనుమానం?"

"నన్ను మామూలు బోగందాన్ని ఉంచుకున్నట్టే ఉంచుకోండి. ఎంతకాలం ప్రాప్తముంటే అంతకాలం మీాదగ్గిర ఉంటాను. మీాకు ఏక్షణాన మొహంమొత్తితే ఆక్షణాన—"

గంగాధరం మాణిక్యంమూతి అట్లాగే ముద్దుపెట్టు కున్నాడు అమిత గట్టిగా!

"నేను మోటువాణ్ణి. నాకు నాజూకులు తెలియవు. నాయిష్టం వచ్చినట్టు మాట్లాడకపోతే అట్లా శిక్షిస్తాను!"

మాణిక్యం అతని మెడచుట్టూ చేతులువేసి, "పది నిమి షాల కిందట ఎంతగౌరవంగాఉన్నాం! ఇంతలో ఇట్లా కావ టానికి కారణంఎవరు? ఆతప్పెవరిది?" అన్నది.

"నాదే!" అన్నాడు గంగాధరం గర్వంగా.

"సరేకాని ఈపని ఆనాడు నేను మీకు తలుపు తెరిచి నప్పుడే ఎందుకు చెయ్యకపోయినారు?"

"ఏపనీ?"

"తలుపు తెరిచి మీరు కనిపించగానే ఎందుకో నాకు పుట్టెడు భయంవేసింది—అమాంతం నన్ను పట్టుకుని ముద్దు పెట్టుకుంటారనే! ఆదడ ఎంత సేపటిదాకానో పోలేదు! ప్రకాశంగారు కనిపెట్టారు కూడానూ!"

"ఛా!"

"ఒట్టండీ! నేను ఎప్పుడూ ఊహించుకుంటూ ఉండే దాన్ని నన్నెవరో బలవంతంగా పట్టుకుని ముద్దు పెట్టుకున్నట్టూ నాకిష్టమైకూడా నేను పెనుగులాడి నట్టూ! ఎందుకో చెప్పలేను కాని మిమ్మల్ని చూడగానే నేను ఎప్పుడూ తలుచుకుంటూ ఉండిన మనిషి మీరేననిపించింది. ఇన్నిరోజులూకూడా నేను రహస్యంగా మీమనిషిని అయినట్టే! ఆపెద్దరహస్యం ఎవరికీ తెలియకుండా దాస్తున్నట్టు ఫీలవుతున్నాను ... ఇప్పుడారహస్యం మీకు తెలిసిపోయింది!"

గంగాధరం చప్పునగంభీరుడై పోయినాడు.

"ఇదంతా కలే! ఎప్పుడో కళ్లు తెరచేటప్పటికి నువ్వుండవు. కాని చాలా అందమైనకల!" అన్నాడతను.

"ఏప్రతిజ్ఞ అయినా మగవాళ్ళకు చెల్లిపోతుంది. మీరు మీమనస్సులో ఉన్నది బయటపెట్టుతానని ప్రతిజ్ఞ చేసి నెగ్గించుకున్నారు. నేను మళ్ళీ ఇటువంటిపని చెయ్యనను కుని చెయ్యటానికి సంసిద్ధురాలను అవుతున్నాను. ఆడజన్మలు వెధవజన్మలు! అంతరాత్మ అనేదిఉన్న ఆడదానికి సుఖం

లేదు. మాకు మధ్య మధ్య స్వేచ్ఛగా నవ్వుదామన్నంత ఉత్సాహం వస్తుంది ఎందుకానవ్వు అని అడుగుతుంది అంత రాత్మ. నామనస్సు ప్రేమతో నిండి పొర్లి పోతున్నది అంటుంది నాబోటి ఆడది. ప్రేమతో నిండ కేంచేస్తుంది లే, నీకూడూ నీకుడ్డా సంపాదించి పెట్టేటంకుకు ఎవరినో ఒకర్ని సంపా దించుకున్నాక! అంటుంది అంతరాత్మ!" అంటూ మాణిక్యం సన్నగా నిట్టూర్చింది.

గంగాధరం ఆమెవంక దీనంగా చూస్తూ, "నువ్వట్లు అనుకుంటున్నావా?" అన్నాడు.

మాణిక్యం నవ్వి "నేనంటే నేనుకాదు. మీరు ముద్దు పెట్టుకోగానే నావళ్లు బంగారమయింది. మీరు ప్రేమించే టప్పటికి నేను దేవతనై పోయినాను!" అన్నది.

# గా లి పా టు

ఆంజనేయశర్మ అరగంటనించీ అట్లా ఆకిటికీదగ్గిర నిలబడి ఆకాశాన్ని కప్పేస్తున్న కారుమబ్బులవంక ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

అరగంటక్రితం ఈ ఆకాశం ఎంత నిర్మలంగాఉందీ! ఒక్క అరగంటలో ఎంత గాలివాన ముసించుకొనివచ్చింది! ఎంతకావాలి? గాలిపాటు!

జీవితంకూడా అంతే! తనసంగతేమిటి? ఇంచు మించు—ఒకటి రెండేండ్లు తక్కువగా—నలభై సంవత్స రాలపాటు ప్రశాంతంగా ఉన్న తన జీవితంమీద ఒక గాలి కొట్టింది. రెండునెలల కాలంలో తన జీవితంలో పెద్దతుపాను రేగింది. ఈ తుపాను తన్ను ఎక్కడికి కొట్టుకుపోతున్నదో, ఏ రాతిగుట్టలమీద తన జీవితాన్ని పరిసమాప్తి చేస్తుందో ఎవరుచెప్పగలరు ?

ఈతుపాను సాగినకొత్తలో తను ఆ ఆవేశాన ఒళ్లు తెలియక, "ఇదే జీవించటమంటే! జీవశక్తి ఉన్నందుకు ప్రతి ఫలం ఇదే!" అనికూడా అనుకున్నాడు! ఇప్పు డాలోచిస్తే ఎంతపొరపాటు అభిప్రాయంగా కనిపిస్తున్నదీ!

ఈ తుపానుఅలలమీద తను తేలి ఈదగలిగితే! ఈగాఢాంధకారంలోకూడా తను దారి చూసుకోగలిగితే! అప్పుడు జీవశక్తి ఉన్నందు కిదే ప్రతిఫలం అనుకోవచ్చును పోనీ, అదిలేదే! ఈఅలలు తనని ముంచెయ్యాలని చూస్తు న్నై; తన జీవితాన్ని ఆవరించిన కాలమేఘాలు ఒక్క మెరు పైనా మెరవలేదు!...

ఆకల్యాణి ఒక్కసారి తన్నుచూసి నవ్వరాదూ? ఆతర వాత తనసంగతిఏమైనా తనకు దిగులు ఉండదు!...

ఈచీకట్లో గుడ్డిగా ఉండటంకంటె ఈ మెరుపుకు తన కళ్లు గుడ్డికావటం లక్షరెట్లు వాంఛనీయంకాదూ?

అకస్మాత్తుగా భయంకరమైన మెరుపొకటి ఆకాశాన్ని తూర్పునించి పడమరకు చీల్చివేసింది. ఆ వెంటనే చెవులు పగిలిపొయ్యే ఉరుముకూడా వినవచ్చింది.

శర్మ నవ్వాడు. ప్రకృతి తన్ను పరిహాసిస్తున్నది!...

చావటానికి సిద్ధంగా ఉన్నానని తెలిసినవాడికి జరిగిపోయినదంతా వివరంగా స్ఫురణకు వస్తుందట. శర్మకుకూడా అట్లాగే గతమంతా జ్ఞాపకంరావటం మొదలుపెట్టింది — ఈ రెండు నెలలనించీ జరిగిందిమాత్రమే. అంతకుపూర్వం జరిగింది కాదు. అసలు అంతకుపూర్వం జీవించటమంటే ఏమిటో అతనికి తెలియదనే!...

ఆరోజున తను గుంటూరుస్టేషనులో ఓవరుబ్రిడ్జి మీద నిలబడి ఉండటమూ, ఎవరో తనపక్కకువచ్చి "ఏవూరండీ?" అని ప్రశ్నించటమూ, తను ఆమనిషిని చూచేలోపల ప్లాట్‌ఫారంమీది కళ్యాణి తనకళ్ళబడటమూ, అంతా అతనికి స్ఫుటంగా కళ్ళయెదట కట్టినట్టుగాఉంది ఇప్పుడు. కల్యాణిని చూడగానే తనకు మతి పోయింది. అంతకుపూర్వం ఎంతమంది స్త్రీలను తనుచూసి ఉండలేదు? అప్పుడు తనేమీ కాలేదు. అప్పుడే ప్రారంభమయింది తన జీవితాన్ని తారుమారుచేస్తున్న ఈతుపాను. అదొకగాలి!

పక్కనఉండి తన్ను పలకరించిన మనిషిసంగతే మరిచిపోయి తను కల్యాణివంక మూఢుడల్లే చూడటం మొదలుపెట్టాడు. "చాలా అందమైన మనిషి!" అని తన పక్కనున్న వ్యక్తి అనేవరకూ తన కతన్ని గురించి ఆలోచనేలేదూ!

ఆదుర్మార్గుడు తననువాదనలో దించాడు. "అన్ని అదృష్టాలలోకీ మనకు కావలిసిన స్త్రీ లభించటం గొప్పఅదృష్టం" అన్నాడా వెంకటేశ్వర్లు.

"'అన్ని దురదృష్టాలలోకీ' అని మీ ఉద్దేశం అయిఉం టుంది" అని తను అందించాడు.

కాదన్నాడు వెంకటేశ్వర్లు. "మాటవరసకు మీ కా ఆడదానిమీద మనసుపోయిం దనుకోండి! మీరు తగినవిధంగా ప్రయత్నం చేస్తే, తగినంత ప్రయత్నంచేస్తే ఆమె మీకు సులభంగా లభిస్తుంది... అయితే ఏమిటంటే, మనవాళ్లు జీవచ్ఛవాలు. వీళ్ళు మనసారా దేన్నీ కోరటంగాని, కోరిన దానికోసరం తగినంత ప్రయత్నం చెయ్యటంగాని ఉండదు... మీ రా మనిషివంక చూశారూ! ఒక్క క్షణంలో మానసి కంగా ఆమెతో సమస్తసుఖాలూ అనుభవించారూ! ఒక్క- నిట్టూర్పు విడిచారూ! ఆమె రైలెక్కి- వెళ్ళిపోయిందీ! మీరు బ్రిడ్జి దిగి వెళ్ళిపోయినారూ! అంతే జీవితాదర్శం. ఇందులో ఆత్మవంచన ఏమిటంటే మనం చాలా నీతిగా ఉంటున్నామని! ఈ నీతేమిటండి! సహం చచ్చినవాళ్ళకూ నపుంసకులకూ తప్ప ఇప్పటి నీతిచట్టం ఎట్లా పనికివస్తుంది చెప్పండీ? ఎవరైనా నీతిగా ఉంటున్నానని చెబితే ముందు నాకు తట్టేదేమిటంటే ఈమనిషిలో ఏదో పెద్ద లోట్ల ఉందీ అని!... మీరంటే మీరుకాదు, నేనంటే నేననికాదు! మాటవరస కంటున్నాను! ఏమంటారు?" అన్నాడా వెంక టేశ్వర్లు.

"మీరు చెప్పేది నా కర్థంకాలేదు. ఇంకొకడి భార్య యొక్క ప్రేమను పొందటానికి మీరు తగినంత ప్రయత్నం ఏమి చేస్తారట? మీ రన్నట్టు మాటవరసకే నా కామెమీద భ్రాంతి కలిగినట్టయితే ఆమెతో ముందు నేను మాట్లాడటానికి అవ

కాశం ఎట్లాకలగాలి? ఆమెకోసరం నేను ప్రయత్నంచెయ్యడమే అధర్మంకావచ్చు! ఆమెకు తన భర్తమీద ప్రేమా, తన శరీరముమీద అభిమానమూ, తనభార్యా ధర్మంమీద గురీ లేవని ఎట్లాఅనుకోగలరూ?" అన్నాడు తను.

"ఎంత అమాయకులండీ మీరూ! ప్రేమఅనేది మానసికధర్మం. ప్రేమలేకుండా వ్యభిచరిస్తున్నవారెంతమంది లేరు? మనం మనసులో రోస్తున్నమనిషితో వెళ్లి ఆనందించవచ్చును. మీకు అనుభవంలేదు, పాపం. శరీరంమీద అభిమానమంటారా? స్త్రీగాని పురుషుడు వ్యభిచరించేటప్పుడు చేసుకునే ఆత్మవంచన ఏమిటో తెలుసునా? అవతలమనిషి శరీరాన్ని మనం పొందుతున్నామనే! మన శరీరాన్ని అవతలమనిషికిస్తున్నామని ఎవరూ అనుకోరు! అందుకని వ్యభిచరించటానికి శరీరాభిమానం ఎక్కడా అడ్డుగాదు. ఇక భార్యాధర్మంమీద గురా? పోనిస్తురూ! ఎంతో పతివ్రతలుగావున్న భార్యలను చూశాను. వాళ్లు ఇతర్రతా పోనికారణంచేత పతివ్రతలే కాని వాళ్లకి నగలమీదఉన్నగురి భర్తలమీద ఎప్పుడూ ఉండదనుకోండి! సర్వేజనాః కాంచన మాశ్రయంతే. ఈ కాలంలో డబ్బుతో కొనరానిదేదో మీరు చెప్పండి! హృదయాలు సహితం మార్కెట్టులో అమ్ముతున్నవి, బాబూ! ఈ కబుర్లెందుకు చెబుతారు!"

ఆ వెంకటేశ్వర్లును చూస్తే తనకు చెప్పరాని రోత పుట్టింది.

"ఇక ఆ విషయం పోనివ్వండి!" అన్నాడు.

"చూశారా! ఆ ముక్కతో ఆఖరూ! మనం దేన్నీ గాఢంగ వాంఛించలేం, బాబూ! నేను మొదటనే మనవి చేస్తినే! నేనింతసేపటినించీ మాట్లాడుతున్నాను, మీరు లాక్యం చేయనన్నా నన్నడిగారా 'ఆమనిషిని గురించి నాకేమైనా తెలుసునా అని? ఎందుకడుగుతారూ? ఆమనిషిని మీకు ఇప్పించటం నాచేతులో ఉండవచ్చును. మీకు ఆమెమీద గాఢమైనవాంఛ లేకపోయిందిగాని, ఉంటే మీకు నేనెం తయినా యీసందర్భములో ఉపకారం చెయ్యగలగవచ్చును! సరే, శలవు! నేనూ ఆబండికే వెళ్లుతున్నాను," అని ఆ వెంక టేశ్వర్లు బ్రిడ్జిమెట్లు దిగటం మొదలుపెట్టాడు.

ఆ సైతాను తన్ను బాగా రెచ్చగొట్టాడు. తన మగ తనాన్ని ఆ వెంకటేశ్వర్లు ఛాలెంజి చేసినట్లయింది. అదీకాక ఆకల్యాణి ఎంతవాంఛనీయగా కనిపించింది! తనమనస్సులో ఆశఅనేది నాటి వెళ్ళిపోతున్నాడా సైతానుగాడు.

తను అతన్ని వెంబడించి మెట్లమీదనే పట్టుకుని, తనలో అంకురించిన ఒక్కసంశయమూ తీర్చుకొన్నాడు, "ఆమనిషి సానికాదు కదా!"

"ఎబ్బే ఇల్లాలండీ. ఇంతవరకు భర్తమొహంతప్ప పర పురుషుణ్ణి ఎరగదు! ప్రమాణం చేస్తాను!" అన్నాడు వెంక టేశ్వర్లు.

అతని ప్రమాణం ఒక్కటే అయితే తను నమ్మిఉండే వాడు కాదు గాని కల్యాణి మొహంచూస్తే తనకే తెలుస్తున్నది.

"ఆమనిషి నాకు నిజంగా కావాలి!" అన్నాడు తను వణుకుతున్న గొంతుతో "నువ్వు నిజంగా నాకేమైనా సహా

యం చెయ్యగలవా? ఎట్లా చెయ్యగలవో నాకు అర్థం కాకుండా ఉంది. కాని నీరుణం ఉంచుకోను!"

వెంకటేశ్వర్లు నవ్వాడు. ఆనవ్వు! అదిచూస్తుంటే తనకు పైత్యవికారం కూడా కలిగింది.

"ఆమనిషి మీకు కావాలంటే నేనుతప్ప మీకు సహాయం చెయ్యగల వ్యక్తి ఇంకొకడు లేడు. నాకామనిషి మీద అంత అధికారం ఉంది. దాన్ని నేనింతవరకూ దుర్వినియోగంచేసి ఎరగను. కాస్తకూ కూస్తకూ దుర్వినియోగం చేసే తలంపుకూడా లేదులెండి." అన్నాడు వెంకటేశ్వర్లు.

"నీకెంత ఆశఉంది? నీకామనిషిమీద ఏవిధమైన అధికారం?" అన్నాడు తను ఈపాటికి పూర్తిగా వణికిపోతూ.

"నాకేంతో ఆశలేదులెండి. నేనొక చిన్నవ్యాపారం తలపెట్టాను. దానికి పదివేలు కావాలి. ఆమెను నేను మీకిప్పించలేకపోతానని మీరెన్నడూ అనుకోకండి. ఆమెను మీ వశంచేసిన మరుక్షణం కాని మీరు నాకు డబ్బువ్వవద్దు. నేనామె మొగుణ్ణే!" అన్నాడు వెంకటేశ్వర్లు నిశ్చింతగా.

సిగ్గుమాలిన వెధవ! అయితే ఏం? తనమాట దక్కించుకున్నాడు. తనుకూడా ఏంచేస్తున్నదీ తెలియకుండానే పదివేలు కక్కాడు. అయిదువేలు అప్పుతెచ్చి మరీనూ!

ఈ నెల్లూరు కాపరంకూడా వెంకటేశ్వర్లు సలహామీదనే. ఇక్కడ ఇల్లుకుదిర్చి తనదగ్గిర కల్యాణిని వదిలిపెట్టి వెంకటేశ్వర్లు మళ్లీ బెజవాడ వెళ్లిపోయినాడు.

తను ఫలానిచోట ఉంటున్నాడని ఎవరికీ తెలియదు— శాస్త్రికితప్ప. శాస్త్రికి తెలియకుండా వీల్లేకపోయింది. ఆ సై

తాను వెంకటేశ్వర్లు తను చేస్తున్న వ్యాపారానికి ఇంకా ఒక్క వెయ్యి తక్కువయినపంటూ వచ్చాడు. అనుకున్నంతా ఇచ్చేశాను, వేధించవద్దన్నాడు తను. వెంకటేశ్వర్లు ఒక వెధవనవ్వు నవ్వి, "అవును! నాకు తెలుసు. నేను రెండుమాటలవాణ్ణి కాను. నాకీ వెయ్యి అప్పు గాయిన్వండి. నేను మళ్లీయిస్తాను. కావలిస్తే ప్రామిసరీనోటు రాసిస్తాను!" అన్నాడు

ఆ అప్పుకూడా శాస్త్రి ద్వారా సృష్టించవలిసి వచ్చింది. అదివరకు అయిదువేలకుకూడా, పాపం, శాస్త్రి సహాయ పడ్డాడు. అతనికి ఇది ఇల్లా అని ఏమీ తెలియదు.

మొదటి వారంరోజులూ కల్యాణి తనవశం కాలేదు. తరవాత ఒకవిధంగా దారికి వచ్చింది. తను తృప్తిపడ్డాడా? ఈపన్మాత్రమైనా లేదు!

తను నడివయస్సువాడు కాకుండా పాతికేళ్ళలోపువాడయితే తృప్తిపడిఉండును. కాని ఇప్పుడు తనకు తెలుసును — ఆమెతో కాపరం చేస్తూకూడా ఆమెను స్పృశించలేకపోవటం ఏమిటో?

తను కల్యాణితో ప్రేమపూర్వకంగా దయగా మాట్లాడాడు. తనప్రేమ ఆమెకు ఒక్కపిసరైనా బోధపడలేదు. ఆమెచెవికి తన మాటలేమీ యెక్కలేదు. తను ఆమెను ఆలింగనంచేసుకున్నాడు. ఆమెకది అంటలేదు. తన చేతలు ఆమెలో ఎటువంటి వికారమూ కలిగించలేదు.

తన యింద్రియాలు తన్ను వశంచేసేసినవికాని అతను రెండురోజులు ఆమెతో సంసారంచేసినతరవాత "ఇక ఈమెను స్పృశించరాదు. ఆమె నా సొత్తు ఎన్నటికీకాదు!" అనుకు

న్నాడు. అట్లా ఉండగలిగితే ఎంతబాగుండిఉండేది! తను నిర్జీవ ప్రతిమతో క్రీడించటానికూడా పాల్పడ్డాడని తెలుసుకోటానికెంతో తలవంపులుగా ఉంది. తనవయస్సేన! తన వయస్సే లేకపోతే అది తెలుసుకోవటమే సాధ్యమయ్యేది కాదేమో!

"హృదయాలుసహితం మార్కెట్టులో అమ్ముతవి!" అని హృదయమేనిటో ఎరగని ఆదుర్మార్గుడు చెప్పటమూ, తను విశ్వసించటమూ!

కల్యాణి హృదయం ఎంతకు అమ్ముడుపోతున్నదో ఆ వెంకటేశ్వర్లు వచ్చి చెప్పగలడా? ఏమిస్తే ఆ కల్యాణి తనంతట వచ్చి తనవంక నవ్వుతూ చూస్తుంది? తనతో సరదాగా మాట్లాడుతుంది? అంతకంటె ఎక్కువకు పోనేవద్దు!

తను అజ్ఞానుడై సజీవమైన వ్యక్తికోసం చెయ్యిచాచాడు. ప్రాణంతో కూడుకున్న దేహం తనకు దొరికింది! ఆత్మ దక్కలేదు.

తనతో కాపరం చేస్తున్న కల్యాణిలో ఆత్మ లేదు. ఆమె ఉద్రేకమనే దాన్ని జయించింది. ఆమెకిప్పుడు బాధ కాని, భయంకాని, దుఃఖంకాని ఆశ్చర్యంకాని లేదు. తను స్టేషనులో ఆనాడు చూసిన మనిషిని తనూ వెంకటేశ్వర్లూ కలిసి హత్యచేశారు. ఈ హత్యకు కనీసం ఇంక్వెస్టయినా జరగలేదు.

ఇట్లా అవుతుందని తెలిసిఉంటే తను ఈపని చేసి ఉండడు. అసలు తన మనస్సే తనకు తెలియలేదు. తనకు నిజంగా కావలిసింది కల్యాణియొక్క ప్రేమ, ఆమె యౌవనం

కాదు. ఆమాట తను గ్రహించటానికి రెండు నెలలు పట్టింది! ఇకనైనా తను గ్రహించవచ్చును—తనవయస్సున!

పాతికేళ్ళ లోపువాడి జ్ఞానేంద్రియాన్ని పూర్తిగా అరికట్టేదీ, వయస్సులో వివేకం సంపాయించలేనిదీ ఒక జంతువు తనలోకూడా ఉంది. ఈరెండు నెలలనించీ తను దాని ప్రబోధం వింటూ ఉండిపోయినాడు. ఇక అసంభవం.

కల్యాణికి పద్దెనిమిది వెళ్ళలేదింకా. ఈ రెండునెలల నించీ తను తన వయస్సుకు సిగ్గుపడ్డాడు; ఇకనైనా తనుగర్వ పడటం ప్రారంభించాలి!...

ఎవరో తలుపుతట్టిన చప్పుడయింది.

"ఎవరువారు?" అన్నాడు శర్మ.

"శర్మా"

"శాస్త్రీ!" పాసెంజరులో వచ్చాడుకాబోలు.

శర్మ వెళ్ళి తలుపుతీశాడు. శాస్త్రి లోపలికివస్తూ "అబ్బ! ఏమిగాలి! విశాఖపట్టణానికి ఇరవైమైళ్ళలోకి వచ్చిందిట తుపాను," అన్నాడు.

"మనకు ఫరవ్వాలేదులే!" అన్నాడు శర్మ నవ్వి.

" నాకంత ధైర్యంలేదు!" అన్నాడు శాస్త్రి శర్మవంక ఒకచిత్రమైన చూపుతిప్పి. "నీకు చాలా దగ్గిరలో ఉన్నదని చెప్పటానికి స్వయంగా వచ్చాను!"

"కూర్చో! కొంచెం నెమ్మదిగా మాట్లాడు. పక్క గదిలో కల్యాణి నిద్రపోతున్నది!

"ఈ వ్యవహారమేమిటో స్వయంగా కనుక్కుందామనికూడా వచ్చాను!"

"అదంతా పెద్దపొరపాటు. నేనిట్లా పప్పులో కాలు వేస్తానని ఎన్నడూ అనుకోలేదురా, శాస్త్రీ!"

"పోనీ, త్వరలో మేలుకొన్నావంతే చాలు. నామటుకు నాకు పశ్చాత్తాపంలో నమ్మకం ఉంది!"

"సరే, నాకు లేదు! నేనేంచెయ్యాను? నిష్కారణంగా ఒక అమాయకురాలి ఆత్మను హత్యచేసేశాను. ఇప్పుడు నేనేంచేస్తే ఆమనిషి మామూలుమనిషి అవుతుంది? ఆమె అట్లా అయిపోయిందని పశ్చాత్తాపమేకాని నాకు, నేను చేసిన పనినిగురించి ఇంకేవిధంగానూ పశ్చాత్తాపపడ్డటంలేదు. నా డబ్బు ఖర్చయిందని పశ్చాత్తాపంలేదు —"

"ఆకోమటి నిన్ను కోర్టు కీడ్చెయ్యబోతున్నాడని పశ్చాత్తాపం ఉందా? నీకేమీ మిగలదని తెలుసుకున్నావా?"

"ఆమెను భర్తనుంచి విడదీశానని పశ్చాత్తాపంలేదు. వాడు పరమనీచుల్లో ఒకడు. ఈసుకుమార పుష్పానికి వాడు విషవాయువు. కాని, శాస్త్రీ, కల్యాణిని చూస్తే నాకు కడుపు తరుక్కుపోతున్నదిరా! ఎవరైనా ఆమెను నవ్వించగలిగితే— పోనీ ఆమెకంట రెండుచుక్కలు కన్నీరైనా కార్పించగలిగితే— నేనామెను వారివశంచేసి పోయి సన్యసిస్తాను. నేను ఎంతో ఆపేక్షగా ఉన్నాను. ఆమె గమనించదు. నేను తనకోసం చావటానికి సిద్ధంగా ఉన్నానని గ్రహించదు. ఇంకా ఏమో నా చేత నౌతుందనుకుని ఇంతకాలం గడిపాను. ఇక కనువిప్పయిపోయింది. నాచేత ఏమీ కాదు."

"మెల్లిగా మాట్లాడు! నన్ను గట్టిగా మాట్లాడవద్దంటివే! ... సరే, ఇందాక నేనేదో చెప్పవచ్చాను. నువువినిపించుకోలేదు!"

"వినిపించుకున్నాను. ఆ సెట్టినన్ను కోర్టుకెక్కిస్తే ఇక్కడ నేను సెట్టిని మిగులుతానన్నావు. పోనీ! కోర్టుకూడా ఎందుకు? అంతా సెట్టికిరాసిచ్చి నేను అడుక్కుతింటాను... కాని కల్యాణి ఏమవుతుంది? మళ్ళీ ఆ వెంకటేశ్వర్లు వాతపడుతుంది. వాడు మళ్లీ ఆమెను ఇంకొకరికి ఇట్లాగే అమ్ముకుంటాడు."

"దానికి నువ్వేం చెయ్యగలవు? రేపు నీదగ్గిర్నించి తనభార్యను తీసుకుపోయి ఇంకొకరికి అమ్మనచ్చును ... ఎంతకుకొన్నావు ఈ మనిషిని!"

"ఇది కొనటమూ అమ్మటమూ కాదు; లంచం. నన్ను ప్రేమించగలందులకు కల్యాణికి శాంతి యిచ్చియుండను. ఆ దుర్మార్గుడు ఆమెను వదిలిపోవటానికి నాకు పదివేలు లంచం ఇచ్చాను!"

"నాకంతా ఒకటిగానే ఉంది — నువ్వేదో గొప్ప పేరు పెట్టుతున్నావనుకొంటున్నావుగాని!... నువ్వింత ఉదాసీనుడవై ఉంటావని నే నెరగను. లేకపోతే నేను స్వయంగా ఇంత దూరం రాకపోదును!" అని శాస్త్రి లేచాడు.

శర్మ నవ్వుతూ, "నిన్ను చూడటం నాకు చాలా సంతోషంగా ఉంది. పశ్చాత్తాపపడకు! నన్ను చూసి సంతోషంగా ఉందని శాస్త్ర నిన్ను నువ్వు నమ్మించుకో, పశ్చాత్తాపపడవు!" అన్నాడు.

ఈ కబుర్లతో ఏంపని అవుతుందన్నట్టు శాస్త్రి తల అడ్డంగా తిప్పి "నేను వెళ్ళిరానా? స్టేషనులో కాస్త నడుం వాల్చి, మెయిలులో తిరిగిపోతాను!" అని శాస్త్రి సెలవు తీసుకున్నాడు.

అతను వెళ్ళినతరువాత ఎంతోసేపు శర్మ వాకిట్లో నిలబడి లోపలికి వెళ్ళబోతూ, ఆకాశంవంక చూశాడు.

ఒక్క మేఘమైనా లేదు! ఆగాలికి ఎక్కడివక్కడ పరారిఅయిఉండాలి. అంత భయంకరంగా ముసించుకుని వచ్చిన తుపానుమేఘాలు ఇట్లా చెల్లాచెదరైపోయినై చిత్రం.

కాని తనకు ముసించుకుని రాబోతున్న ప్రళయానికి అడ్డేముంది?

శర్మ అడుగులో అడుగు వేసుకుంటూ పడకగదిలోకి వెళ్లాడు. తగ్గించిఉన్నదీపం హెచ్చించి ఒక్కసారి కల్యాణి మొహం చూసి మరీ నిద్రపోదా మనిపించింది. ఎంతో ప్రయత్నం చేశాడు ఆకోరిక చాపుకుందామని. ఊరికే చూసినంత మాత్రాన పొయ్యేదేమిటని దీపం పెద్దదిచేసి చప్పుడుచెయ్యకుండా కల్యాణి పక్కదగ్గరికి వెళ్ళాడు.

కల్యాణి కళ్లు తెరుచుకునిఉంది. అతనిమొహంవంక ఆశ్చర్యంచూసి, నవ్వుతూ చేతులు చాచింది. శర్మ తనకళ్ళను తను నమ్మలేకపోయినాడు, స్తంభంమాదిరిగా అట్లాగే నిలబడి పోయినాడు.

"నేనంతా విన్నాను నాతో ఈమాట అదివరకెందుకు చెప్పలేదూ? మావారు మీదబ్బంతా ఎక్కడదాచిఉంటారో నేనూహించగలను. రేపే బయలుదేరివెళ్ళి అదంతా తెచ్చుకుందాం. పొద్దు పోయింది. నిద్రపోదాం రండి!" అన్నది కల్యాణి.



# ౫ సాహసి

ఈసంఘం ఎప్పుడిట్లా కావటం మొదలుపెట్టిందో తెలియదు. ముట్టుకుంటే కచ్చికలాగు పొడిపొడి కావటానికి సిద్ధంగాఉంది ఈ మనసంఘం. ప్రతిఇద్దరి మనుష్యులమధ్యా కనిపించని గోడ లున్నవి. ఒకరినిగురించి ఒకరు పూర్తిగా తెలుసుకో ప్రయత్నించటం పెద్దమనిషితరహా కాదు. ఒకవేళ ఒకరిలోపాలు ఒకరికి తెలిసినా అవి తెలియనట్లు నటించటం నాగరికత. వాటిని బయటపెట్టినవాడు శుద్ధ పల్లెటూరు మొరటుమనిషి.

మనలనుగురించి లోకం తెలుసుకుంటుందని ఎప్పుడు భయపడటం ప్రారంభించామో ఆనాడు మనము లోకంలో వాళ్ళను గురించి తెలుసుకోకుండా ఉండటం మర్యాదకరమైన పనిగా చూస్తాం. మనిషికీమనిషికీ మధ్యదాటరాని అగడ్తలు. ఎవరి నాలుగు గోడలమధ్య వారు ఎంత అవినీతికరంగానైనా ప్రవర్తించవచ్చును! ఇక ఈసంఘం ముట్టుకుంటే కచ్చికరాలినట్లు రాలక ఏమవుతుందీ?

కేవలమూ వ్యక్తిగతములైన లోపాలు అట్లాఉంచి సంఘానికే తలవంపులు తెచ్చిపెట్టే పనులు చేస్తారు కొందరు. వారాపని చేస్తుంటే అనేకవందలమంది చూసి ఊరుకుంటారు. చాటుగా అటువంటి పనిచేసినవాణ్ణి తిట్టుకుంటారు. నాఅభిప్రాయంలో వారంతా ఆపనికి అనుమోదకులే. వారిలో ఎవరికీ సంఘబుద్ధి అనేటలేదు వారివల్లసంఘానికిఈషణ్మాత్రం ప్రయోజనం లేదు. నూటికి తొంభైతొమ్మిదిన్నరమంది అట్లా ఉండటంకూడా నాకంత విచిత్రంగాతోచదు. కాని ఎవ

డైనా సాహసించి అనుష్ఠానాన్ని తలపెట్టినవాణ్ణి నిలవదీసి "నువ్వీపని ఎందుకు చేస్తున్నావు? నీకిది తగదు. నిన్ను నేనీపని చెయ్యనివ్వను!" అని అనగలిగితే మిగిలినవారు ఆ సాహసికి సాయం రాకపోగా వాడిమీద తలాఒక రాయీ వెయ్యటం జరిగినప్పుడు, "ఈ సంఘానికి ముక్తి ఉందా?" అనిపిస్తుంది.

మా పార్వతీశం మామయ్యకు జరిగిన అనుభవం అందరూ వినితీరవలసిందే. మా మామయ్య పెద్ద సంఘసంస్కర్త అని కాని, ఈ సంఘం ఎట్లా బాగుపడుతుందా అని ఆయన అహోరాత్రులు చింతించేవాడని కాని మీరు ఒక్కనాటికి అనుకోవద్దు. ఆయనకు సామాన్యంగా ఏ విషయమూ పట్టినట్టుండేది కాదు. ఎవరిజోలీ అక్కర్లేనట్టుండేవాడాయన. కాని నేను ఆయన్ను బాగా ఎరుగుదును కనక చెప్తున్నాను, ఎవరు ఏవిధమైన సాంఘిక అత్యాచారం చేసినట్టు విన్నా ఆయన లోలోపల అగ్నిపర్వతంమాదిరిగా కుమిలిపొయ్యేవాడు. ఆయన పూర్వాచారపరాయణుడూ కాడు, అధునాతనుడూ కాడు.

"ఏం మామయ్యా, నీకు ఇప్పటిపద్ధతులిష్టమా వెనకటిపద్ధతులిష్టమా?" అని నేనంటే, "ఇదేమయినా మతముట్రా, అబ్బాయి? వ్యక్తులకూ వారిద్వారా దేశానికీ ఏది క్షేమమో కాస్త బుర్ర ఉన్నవాడికి సులభంగా తెలిసిపోతుందే! దీనికిన్ని పేర్లెందుకూ?" అనేవాడు.

"ఆ దేశక్షేమాన్ని గురించే రెండురకాల అభిప్రాయాలుండవచ్చునుగా?" అని నేనంటే, "ఎబ్బే! ఏదిఎట్లా జరగాలో దాదాపు అందరికీ తెలుసు. అయితే ఏమిటంటే ఒకపద్యం మనం అర్థంచేసుకోవటమూ దానిఅర్థం మరొకరికి చెప్పగల

గటమూ ఒకటికానట్టే, దేశక్షేమానికి ఏమేమిచేస్తే బాగుంటుందో అది జరిగేటట్లు చెయ్యటం అందరివల్లా కాదు. దానికి నిజమైన నాయకుడు కావాలి. పైగా మరొక చిక్కేమిటంటే ఈమానవ హృదయాలను భయమనేది పూర్తిగా ఆవేశించి ఉండటంవల్ల ఈకక్షలు. కొందరికి కొత్తపద్ధతులంటే భయం. అందుకని వారు సనాతనులు. మరికొందరికి కొత్తపద్ధతులు ఆమోదించక పోవటానికి భయం. వారు అధునాతనులు. నా వంటివాడు తనహృదయాన్నీ మెదడునూ అనుసరించి వెళ్ళుతూవుంటే "గోడమీదిపిల్లి" అని వాడికి పేరు పెట్టేస్తారు," అనేవాడు.

మామామయ్య మంచినియమాలు కలవాడు. ఆయన శరీరం వజ్రశరీరం. రోజూ ఉదయమే లేచి కుస్తీకి తయారవుతున్నవాడల్లే ఎక్సరసైజుచేసేవాడు. మేము కుర్రవాళ్ళం తుమ్మినా దగ్గినా ఆయన నవ్వేవాడు. ఆహారంకూడా మితంగానూ వంటికి ఆరోగ్యవంతంగానూ తినేవాడు. ఒకసారి ఉద్రేకంలో ఆయనమాదిరిగానే అలవాట్లు చేసుకుందామని ప్రయత్నంచేసి వారంరోజులుకూడా నెగ్గించుకోలేక పోయినాను.

"ఉత్తఆవేశంతో పనులుగావురా, నాయనా, నియమం అనగానే దీక్ష కావాలి. పొద్దున్నే లేచి అరగ్లాసెడు చల్లనినీళ్లు తాగటానికూడా దీక్ష కావాలి. ముందు మనస్సును నియమించగలిగితే ఆ తరవాత నువ్వు నీ శరీరాన్ని నియమించకుండా ఉండలేవు. అసంభవం అప్పుడు నీకు ఆరోగ్యమూ బలమూ తప్పనిసరిగా కావలసివస్తై," అని ఆయన నాతో అన్నాడు.

నిజంగా ఆయనమనస్సూ అటువంటిదే. ఇంకొకడి మనస్సు ఇటువంటిదీఅని చెప్పరావటంసాహసమే కాని, ఆయన ఎన్నడూ నీచమైన ఆలోచన చేసేవాడుకాడనీ, ఆయన శరీరం ఎంత ధృడంగానూ ఆరోగ్యవంతంగానూ ఉండేదో మనస్సు కూడా అంతధృఢంగా, ఆరోగ్యవంతంగా ఉండేదని నాసంపూర్ణ విశ్వాసం. ఆయన ఎంత బలంగలవాడో అంత ధైర్యంగలవాడు. ఆబలాన్ని ఎంత ప్రకటించుకునేవాడో ధైర్యాన్ని అంతే ప్రకటించుకునేవాడు.

ఆయన్ను గురించి ఇంతవిపులంగా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, ఆయన కుమారుడు రాజేశ్వర్రావు అవివేకంవల్ల ఆయన చాలా అపఖ్యాతిపాలయినాడు. ఆయనమీద రాళ్లురువ్విన వాళ్ళల్లో ఒక్కరుకూడా అయన్ను సరిగాఎరగరు. ఆయన్ను గురించి ఇంతవిపులంగా చెప్పకుండా, ఆయనకు జరిగిన అనుభవం మాత్రమే చెప్పి ఆయనయందు లోకానికి నమ్మకం కలిగేటట్టు చెయ్యలేను.

రాజేశ్వర్రావునుగురించి సంగ్రహంగా ఒక్కముక్కలో చెప్పాలంటే, వాడు తల్లిపోలిక — అన్ని విషయాల్లోనూ! వాడిది చిన్నప్పటినుంచీ వక్రబుద్ధి. ఏవిషయంలోనూ సూటిగా వెళ్ళేదికాదు, అదేంఖర్మమో! వాడు పిరికి. అమిత స్వల్పవిషయాలలోకూడా అబద్ధాలాడేవాడు. నిజంచెప్పటం ఎప్పుడూ అపాయకరంఅనే వాడివిశ్వాసం. అమిత తిండిపోతు. వాడిది అనారోగ్యంతో కూడుకున్న ద్వంద్వశరీరం. చిన్నప్పటినించీ వాణ్ణిచూస్తే నాకు ఒకందుకు చెడ్డకోపంగా ఉండేది. వాడి దౌర్బల్యం వాడికి తెలిసికూడా సిగ్గుపడేవాడుకాదు. మీాకు

ముక్కలి వాడికున్న దుర్గుణాలన్నీ అందరికీ ఉన్నవని వాడికి గట్టినమ్మకం— అందరూ భోజనప్రియులనే, అందరూ అబద్ధాలాడేవాళ్ళనే, ప్రతిరోజూ స్నానంచెయ్యటం అందరికీ అసహ్యమనే. కాస్తపెద్దయి వాడిబుద్ధి వికసించటం మొదలుపెట్టినతరవాత ఇంకొకతియరీ బయటపెట్టాడు వాడు. తనుచేస్తున్న పాడుపనులన్నీ అందరికీ చెయ్యాలనేఉంటుందిట—సిగరెట్లు కాల్చాలనీ, ఎప్పుడైనా కాస్త బీరుతాగిరావాలనీ, అప్పుడప్పుడూ సానియిళ్ళకు వెళ్ళిరావాలనీ! అయితే మేమంతా మూఢనమ్మకాలను పట్టుకుని ఆపనులు చెయ్యటానికి జంకుతున్నామట. వాడు ధీరుడై జంకులేకుండా ఆపనులన్నీ చేసివేస్తున్నాడట!

"మావాణ్ణి తల్లి పాడుచేసిందని కొంతకాలం అభిప్రాయపడ్డాను. కాని తరవాత తరవాత నాకా అభిప్రాయం మారిపోయింది. నాస్నేహితుడి కుమార్తెను ఒకతెను కొంతకాలంకిందట తలవని తలంపుగా చూశాను. ఆపిల్లను చాలా పసిదానప్పుడు, నా స్నేహితుడు కొద్దిరోజుల్లో చనిపోతాడనగా చూశాను. వాడు పోయినతరవాత వాడిభార్య ఆ పిల్లను తన అత్తవారింటివైపువారితో ఎటువంటి సంబంధమూ లేకుండా పెంచింది. కాని తీరా నేను చూడవచ్చేసమయానికి ఆపిల్ల అచ్చు మాస్నేహితుడల్లేనే తయారయిఉన్నది— గుణగణాల్లోకూడా. ఎన్నడూ చూడని తన తండ్రివైపువాళ్ళమీద దాని కెంతో అభిమానం. తల్లియొక్క వెలితిఆలోచనలూ నిస్సారమైన హృదయమూ ఆపిల్ల కేకోశానా లేవు!" అని ఒకసారి మా మామయ్య నాతో అన్నాడు తనకొడుకు రాజేశ్వరరావును గురించి చెబుతూ.

ఇక ఈ ప్రస్తావనలు చాలించి అసలు విషయానికి వస్తాను.

రాజేశ్వర్రావుకు పదిహేడేళ్ళప్పుడు మా మామయ్య వాడివివాహం చేశాడు. ఆయనకు కుమారుడిమీద ఈషన్మాత్రమయినా అభిమానం లేకపోయినప్పటికీ, అభిమానం ఉంటే ఎంత శ్రమపడి ఉండేవాడో అంతశ్రమపడి వాడికి అన్నివిధాలా లక్షణవతి అయిన భార్యను సంపాదించిపెట్టాడు.

పెళ్ళిఅయిన సంవత్సరానికే ఆయనకు పశ్చాత్తాపం కలిగేటట్టు ప్రవర్తించటం మొదలుపెట్టాడు రాజేశ్వర్రావు. వాడు పెళ్ళి అయిననాటినుంచీ మామగారిమీద సన్నసన్నగా ధార్ష్టికం చెయ్యటం సాగించాడు. మొదట మామామయ్య చూసీచూడనట్టు ఊరుకున్నాడు కాని రాజేశ్వర్రావు ప్రవర్తన నానాటికీ దుర్భరమయింది.

వాడితో ముఖాముఖీ వాడి లోపాలన్నీ తర్కించచటంలో మా మామయ్య పెద్ద పొరపాటు చేశాడేమో అనుకుంటాను. ఆనాటినించీ వాడికి తండ్రిమీద ఏమూలో ఉంటూ వచ్చిన బెదురుకాస్తా పోయింది.

"నీఅంత అవివేకిని, పొగరుబోతును, అసమర్థుణ్ణి, అజ్ఞానిని, అవినీతిపరుణ్ణి, సిగ్గులేనివాణ్ణి నేనెక్కడా చూడలేదు. నిన్ను గురించీ నీగొప్పతనాన్ని గురించీ గర్వించటం మాని నువ్వు ప్రపంచాన్నీ మనుష్యులనూ గురించి ఆలోచించి అర్థంచేసుకోవటం నేర్చుకోకపోతే బాగుపడవు!" అని మా మామయ్య అన్నమాటల్లో సత్యం లేకపోలేదు. అయితే ఈలోకంలోనిజం ఎవడిక్కావాలి? మారాజేశ్వర్రావుకు అసలెందుకు?

వాడు తండ్రికి ఘాటుగానే జవాబుచెప్పాడు. వాడి సమాధానంవిని మామామయ్య నేనెన్నడూ నాజన్మలో మరప లేనిముక్క ఒక్కటే అన్నాడు.

"నిన్ను నేను అదుపుచెయ్యటం మానేసి చాలాకాలం అయింది. నీలోపాలు నీకు విప్పిచెప్పటం నాకు ఎంతబాధ కలిగించిందో నువ్వూహించలేదు. కాని నేనాబాధ నిష్కారణంగా పడ్డవాణ్ణయినానని గ్రహించాను. ఇక ఈవిషయం నీతో ఎత్తను!"

ఈచిన్న ఘర్షణ జరిగినప్పుడు నేనక్కడే ఉన్నాను. అంతవరకూ ఎన్నడూ నేనాతండ్రికొడుకులను చూసి అంత ఆశ్చర్యపడలేదు. మంచి యవ్వనంలో ఉన్నట్టు కనిపిస్తున్న ఆనలభైఏళ్ళ తండ్రి, జుట్టునెరిసి, పొట్టపెంచుకొని సుఖరోగాలతో తీసుకోవటంకూడా ప్రారంభించిన ఆకొడుకూ! వాణ్ణి కొడుకని చెప్పుకోటానికి ఆతండ్రి ఎంత సిగ్గుపడుతూఉండి ఉండవచ్చును!

తనభార్య రజస్వలాయిందని తెలిసిననాటినుంచీ రాజేశ్వర్రావు తనభార్యను కాపరానికి తెచ్చుకోవటాన్నిగురించి ఆలోచించటం మొదలుపెట్టాడట. ఆరోజుల్లో వాడితో మాట్లాడటం తటస్థించిన ప్రతివాడికీ వాడు భార్యను కాపరానికి తెచ్చుకోటం గురించి వివరాలు వినలేక తలపట్టిపోయినట్టు తెలుస్తుంది.

ఎవరి సానుభూతీ పొందలేనివాడై రాజేశ్వర్రావు చివరకు మామగారికే ఉత్తరంరాశాడు తనభార్యను పంపటానికి వీలయ్యేదీ లేందీ తెలపమని. దానికిప్పుడే ఏమంతతొందర అనీ,

ఆవిషయాలు తానూ తనవియ్యంకుడూ సంప్రతించుకుని ఏర్పాటు చెయ్యటం భావ్యంగా ఉంటుందేమోనని రాజేశ్వర్రావుకు మామగారు సమాధానం రాశాడు. ఇంకొకరి సహాయం అవసరం లేకుండానే తనభార్యతో కాపరంచేసే జ్ఞానమూ అనుభవమూ తనకు కలిగినవని ధైర్యంచెబుతూ రాజేశ్వర్రావు మామగారికి మళ్ళీ రాశాడు. దానికి మామగారు మౌనంగా ఊరుకున్నాడు.

రాజేశ్వర్రావు తనకు చాలా గొప్ప పరాభవం జరిగిందని ఊహించుకుని వెళ్ళి తండ్రితో కలియబడ్డాడు.

"నువ్వు నీ భార్యను ఎప్పుడు కాపరానికి తెచ్చుకున్నా నా అభ్యంతరం లేదుకాని కనీసం నీ ఒళ్ళు బాగుచేయించుకునేదాకానైనా నువ్వు తొందరపడి లాభం లేదనుకుంటాను" అన్నాడు మా మామయ్య.

తన శరీరం బాగుచేసుకోవటంయొక్క ఆవశ్యకత రాజేశ్వర్రావుకు గోచరించినట్టు లేదు. తండ్రిఅన్నట్టే ఎవరో స్నేహితులుకూడా అంటే రాజేశ్వర్రావు తను ఒళ్ళు బాగు చేయించుకోవటంలో అర్థంలేదనీ, తను ఎట్లాగో తన స్నేహితురాళ్ళతో బాంధవ్యం భార్యకోసం వదులుకోబోవటం లేదనీ అన్నాడట.

"అందుకని నీభార్యనుకూడా చెడగొట్టుతావా ?" అని వాళ్ళడిగితే "ఎట్లాగో తప్పనిదానికి చేసేదేముంది? నేను చెడిపోలేదా ? నేను ఒకప్పుడు అందరిమల్లే ఉన్నవాణ్ణి కానా? నాతోపాటు నాభార్యానూ! అగ్నిహోత్రుడి ఎదట పెట్టుకున్న ఒట్లన్నీ ఏమిటి?" అని వాదుచాలాయుక్తిగా వాదించాడట.

తన తండ్రివల్ల తనకేమీ కాదనీ, తను మామగారికి ఇక ఏమాత్రమూ అలుసు ఇవ్వరాదనీ నిశ్చయించుకుని రాజేశ్వర్రావు మామగారి యింటికి బయలుదేరి వెళ్ళి, ఆయనతో పెద్ద పోట్లాట పెట్టాడు— ఆవింత చూడటానికి దాదాపు వందమంది వచ్చారట!— ఆఖరుకు తనపంతం నెగ్గించుకొని భార్యను వెంటపెట్టుకుని మావాడు ఇంటికి వచ్చేశాడు.

ఆ తీవరకూ వస్తుందని మా మామయ్య కలలో కూడా అనుకోలేదు. పన్నెండేళ్ళు వెళ్ళిన పసికూన, అమాయకురాలు, ఖర్మంచాలక రజస్వల అయిందికాని సరిగా అవయవపుష్టి అయినా పొందనిది, తన కోడలు శారద రాజేశ్వర్రావు మోహానికి ఆహుతి కానుండటం ఆయన సహించలేక పోయినాడు. తన కర్తవ్యం ఏమిటో ఆయన వెంటనే తేల్చుకున్నాడు.

ఆ రాత్రి భోజనానంతరం ఆయన భార్యను, "శారదకు ఎక్కడ పక్క వేస్తున్నావు?" అని అడిగాడు.

"అబ్బాయీ అదీ గదిలో పడుకుంటారు," అన్నదామె.

"నేను?"

"మీరు వసారాలో పడుకోండి."

"వల్లకాదు, నాకుకూడా ఆగదిలో పక్క వెయ్యి."

"అయితే వాళ్ళో?" అన్నది మా అత్తయ్య ఆశ్చర్యంతో.

"వాళ్ళెవరు?... నీకొడుకు సంగతి నాకు తెలియదు. శారద గదిలోనే పడుకుంటుంది నువ్వూ గదిలోనే పడుకుంటావు."

"ఇదేం చోద్యమమ్మా—!" అని ప్రారంభించిం దావిడ.

"నీవు ఆశ్చర్యపడటం మానేసి నేను చెప్పినట్టు చెయ్యి!"

ఆరాత్రి అట్లాగే గడిచింది. రాజేశ్వర్రావు ఏంచెయ్యటానికీ తోచనివాడైనాడు. ఇట్లా వరసగా రెండురోజులు గడిచినతరవాతగాని తండ్రితో పోట్లాడటానికి ధైర్యంచాలక పోయింది వాడికి.

"నీఉద్దేశం నాకు అర్థంకాలేదు. నేను పెళ్ళాన్ని తెచ్చుకోవట మేమిటి? దాన్ని పెట్టుకుని నువు గదిలో పడుకోవటం ఏమిటి?" అన్నాడు రాజేశ్వర్రావు తండ్రితో.

"దానిదారిన అదే అర్థమాతుంది." అన్నాడు తండ్రి.

"అమ్మా, ఇవాళరాత్రి నువ్వాగదిలో పడుకోకు!" అని కొడుకు తల్లితో రహస్యంగా చెప్పాడు.

ఆరాత్రి తనభార్య గదిలో పక్క వేసుకోకపోవటం చూసి మామామయ్య భార్యని కారణం అడిగాడు.

"నాకు ఉక్కగా ఉంది. వసారాలో పడుకుంటాను," అన్నదావిడ.

"సరే, వెళ్ళు!" అన్నాడు మామామయ్య.

కాని శారదతో చిక్కువచ్చింది. ఆపిల్ల గదిలో అడుగు పెట్టటానికే జంకింది. మామామయ్య ఇవతలికి వచ్చి వసారాలో పక్క వేసుకుంటున్న అత్తగారిదగ్గిర తారట్లాడుతున్న శారదను "లోపలికి వెళ్ళి నీపక్కమీద పడుకో!" అన్నాడు. శారద కదల్లేదు. అప్పటికి అత్తగారిబోధ కొంత అయింది.

"వెళ్ళు!" అని గద్దించాడు మామామయ్య. శారద దడుచుకుని పిల్లిమాదిరిగా వెళ్ళింది లోపలికి. ఆరాత్రి మా మామయ్యా శారదా ఆగదిలో పడుకున్నారు. ఆపిల్లకు ఒక రాత్రివేళఅయినా నిద్రపట్టి ఉంటుంది కాని మా మామయ్య రెప్పవాల్చలేదుట.

నేనయితే అటువంటి రాత్రి గడిపినతరవాత ఎవరెట్లా చస్తే నాక్షేమని నాదారిన నేను వెళ్ళేవాణ్ణి. మామామయ్య తీర్మానం రెట్టింపయిందేకాని మరొకటి కాలేదు.

మర్నాడు రాజేశ్వరరావు తను ఎరిగిఉన్న అందరితోటీ టముటమూ వేసివచ్చాడు, "నేను నాభార్యను ఏలను! రాత్రి మానాన్న ఏం చేశాడనుకున్నావు? నాభార్యను పెట్టుకుని ఒంటరిగా గదిలో పడుకున్నాడు!" అని.

అందరూ నోళ్లు తెరుచుకుని విన్నారు. కొందరు ముక్కు-మీద వేలుపెట్టుకుని "హారెరెరె!" అన్నారు "చూశావా?" అన్నారు మరికొందరు. "నిజమే?" అని ఆశ్చర్యపోయినారు ఇంకాకొందరు. ఒక్కడైనా "ఛీ! అప్రాశ్యుడా! నోరుముయ్యి!" అన్నవాళ్లు లేరు.

మా మామయ్య ఆ రాత్రంతా గదితలుపురెక్కలు భార్లా తెరిచే ఉంచాడు!

ఒక్కొక్కరే తను చెప్పినది విని నమ్ముతున్నకొద్దీ రాజేశ్వరరావుకు నిజంగానే తన తండ్రి ఏదో చేశాడని ధృవమై ఉండాలి. ఎటువంటి అల్లరీలేకుండా ఆ రాత్రంతా మధ్యాహ్నమంతా గడిపినవాడు సాయంకాలం ఇంటికివచ్చి తండ్రిని అడ్డమైనమాటలూ అన్నాడు. తన భార్యకూ తండ్రికీ రంకుకట్టాడు.

తను భార్యాను ఏలుకోబోవటం లేదన్నాడు. తనభాగం పంచి పెట్టమన్నాడు. ఇక ఆయన తనకు తండ్రే కాడు, అయితే అటు వంటిపని చెయ్యడన్నాడు.

దానికికూడా మా మ్మామయ్య చక్కని సమాధానం చెప్పాడు. "అవును! నేనిపని చేస్తున్నది నీ తండ్రిగా కాదు. నేను ఆపగలిగిన పరిస్థితులలో నువ్వు ఆపనిదానికి రోగాలు తగిలించ నివ్వను. ఆపిల్ల నా కూతురయి ఉండవచ్చును! నీకు కావల సిన భాగం ఇవ్వటానికి—నువ్వడగటానికి—ఇదికాదు సమయం. అంత అర్జంటయితే కోర్టుకు వెళ్లు!"

"దాని జీవితాన్ని ధ్వంసం చెయ్యటానికి నీకేం అధి కారం ఉంది? దాన్ని రేపు నేనేలకపోతే నువ్వు ఏలుతావా? అది నిన్ను అడిగిందా తన్ను కాపాడమని?" అని వాదించాడు సుపుత్రుడు.

"దానికి నాలుగింతలుంది నా వయసు. దాన్ని అడిగి కనుక్కోకుండా నావిధి నేను నిర్వర్తించలేననా? ఏమిటి నీ తా త్పర్యం?" అన్నాడు మామామయ్య.

ఫలాని పార్వతీశంగారు కోడల్ని ఉంచుకున్నాడనీ, కొడుకును ఇంట్లోనించి వెళ్లిపొమ్మన్నాడనీకూడా ఊరంతా పాక్కిపోయింది.

ఎందుకు పాక్కదూ? మా అత్తయ్య, అడగనివారిది పాపంగా, తనకొడుకు తండ్రిమీదచేసిన ప్రచారమే, అంద రాడవాళ్ళతోనూ భర్తమీదచెయ్యసాగింది. అందరూ నిజమే ననుకునేటందుకు వీలుగా రాజేశ్వర్రావు ఇంట్లోనించి వెళ్ళి పోయినాడు. తన స్నేహితురాళ్లయిళ్ళలో ఆరోజులు గడిపి

ఉంటాడు. ఇందులో కూడా మరీహాస్యాస్పదమైనవిషయం ఏమిటంటే వాడితల్లి భర్తకు తెలియకుండా ఇంట్లోనించి డబ్బు తస్కరించి వాడికి ఇస్తూ ఉండేది.

మా మామయ్య ఇట్లా అపఖ్యాతిపాలు కావటం నాకు చాలా కష్టంవేసింది.

"ఏమిటి, మామయ్యా, ఊరంతా ఇట్లా పొక్కిపోతున్నది?" అన్నాను.

"ఇదే సంఘం! నేను నలభై ఏళ్ళనించీ ఉంటున్న ఈ ఊళ్లో నన్ను నిజంగా ఎరిగినవాడు ఒక్కడూ లేకపోవటం నీకేమైనా ఆశ్చర్యంగా ఉందేమో! నాకు లేదు!" అన్నాడాయన.

"వాడిదారిన వాణ్ణి పోనివ్వరాదూ? నువ్వెందుకు నిష్కారణంగా అపఖ్యాతిపాలు కావాలంటాను?"

"నన్ను ఏమాత్రమూ ఎరగనివాళ్లు నన్నుగురించి ఏమనుకుంటే ఏమంటాను? ఇది సాంఘిక సమస్య అని ఒక్కడికికూడా తోచలేదు! ఒక్కడికి! దీన్ని మా అంతఃకలహం కింద భావించారు. కాదూ?"

ఆయనతో తర్కించటం కష్టమే. అయినా, ఆయనమీది అభిమానంచేత నయితేనేమి, నాకు రాజేశ్వర్రావుమీదగల అసహ్యంవల్లనయితేనేమి మా మామయ్య తన ప్రయత్నంనించి విరమించుకుంటే బాగుంటుందని తోచింది.

"ఒక్కసంగతి గమనించు, మామయ్యా!" అన్నాను, నేను ప్రయోగిస్తున్న అస్త్రానికి తిరుగుఉండదని లోలోపల గర్విస్తూ "మీవాడు నీకోడలి శరీరం పాడుచేస్తాడని కద నీఅభ్యంతరం? నువ్వు కోరినప్రకారం వాడు ఇప్పటిమట్టుకు

ఒళ్ళు బాగుచేయించుకోం టేమాత్రం ఏమయిందీ ? వాడేనా డయినా మళ్ళీ రోగాలు తాకించుకుని భార్యకు వాటిని సం క్రమింపజేయ వచ్చును. అసలు మనిషిని నువ్వేమైనా చెయ్య గలవా ?"

మా మామయ్య నా అజ్ఞానానికి నవ్వాడు.

"ఎవడైనా నీమీద పగబట్టి ఉన్నాడని తెలుస్తుంది. వాడు నిన్ను ఏమీ చెయ్యకుండా శాశ్వతమైన ఏర్పాటు నేను చెయ్యలేని అసమర్థుణ్ణి కావచ్చును. కాని నీవిరోధి సాయుధుడై ఉండటం ఎరిగీ నిన్ను వాడికి ఒంటరిగా వప్పజెప్పి నాదారిన నేనుబోతే నా సంఘబుద్ధికి నువ్వేమని మెచ్చుకుం టావో ఊహించలేకుండా ఉన్నాను!" అన్నాడు మా మామయ్య. ఆయన కెవరు సమాధానం చెప్పగలరు ? నేను ఆయనతో వాదం పెట్టుకుని ఆయనతత్వం అర్థంచేసుకో లేకపో యినానని మాత్రంరుజువు చేసుకున్నాను! అర్థంగానివిషయాలను గురించి కుతర్కంసాగించే నేర్పు ఈకాలపు విద్యలో ఉందను కుంటాను.

నేను చిట్టచివరకు "పోనీ, నువ్వు ఎట్లాగయినా గెలు స్తావనే నమ్మకం ఉందా?" అని అడిగాను.

"లేదు! నాఒక్కడివల్ల ఏమవుతుంది? మావాడు సం వత్సరం పాటయినా నాతో యుద్ధంచేస్తాడు కాని ఒక్క నెల ఓపికపట్టి తనశరీరం బాగుచేసుకుని నాబాధ్యతనించి నన్ను తప్పించడు. నేను అసమర్థుడినైనా నాకళ్ళఎదట ఈఅత్యాచారం జరగనిచ్చాననే అవమానం నాకు లేకుండా చెయ్యడు! అం

ములో నేడుంది మానవజాతిని పాతాళానికి ఈడుస్తున్న మౌఢ్యమూ మౌర్ఖ్యమూనూ!" అన్నాడాయన.

చివరకు ఆయన అన్నంతా అయింది. శారదను ఇరుగు పొరుగు అమ్మలక్కలు భయపెట్టారు, "మీమామగారు నిష్కారణంగా నీగొంతుకోస్తున్నాడు. రేపు నిన్ను నీభర్త ఏలకపోతే ఆయన అడ్డపడుతాడా?...అసలు ఇప్పటికే అంతా మించిపోయుందేమో! వెళ్ళి నీమొగుడి కాళ్ళమీదపడు నీ దుంపతెగా!" అని.

శారద వాళ్ళసలహాప్రకారమే చేసింది. ఆపిల్లను భర్త ఇవ్వాళకూడా దెప్పుతునేఉంటాడు. "నువ్వు నాకెందుకే, పీనుగా? మీమామగారి దగ్గిరికిపో. నేను నిన్ను ఏలనని ఎప్పుడూ చెప్పుతూనే ఉన్నాను!" అని.

"నువ్వు ఏలకపోతే నీభార్యకు రోగాలు ఎట్లా తగిలినైరా, పశువా?" అని వాణ్ణి అడుగుదామనుకుంటాను. కాని నాకామాట అడిగేటందుకు సాహసంచాలదు!



# ౬ పెంకె పిల్ల

రామనాథంగారు నాకు మామగారు కాబోతారని ఎరగకుండా వారింట్లో తూర్పు వేపుగదిలో అద్దెకుంటూ ఎనిమిదేళ్లు చదువుకున్నాను. నాహైస్కూలు చదువంతా వారింట్లోనే

వెళ్ళిపోయింది. మా పల్లెటూళ్ళో వీధి బడి చదువుపూర్తి చేసి నేను ఎనిమిదోఏట నే ఇంగ్లీషు చదువుకోసమై బస్తీకి రావలసి వచ్చింది. మా నాన్నకు ఇంగ్లీషు చదువంటే ఇష్టమే కాని బస్తీ జీవనం ఇష్టంలేదు. అందుకని ఆయన మా అమ్మతో కూడా నా వెంట రాలేదు. అంత చిన్న వయసునించీ నేను హోటల్లోనే తింటూ శనిఆదివారాలు వచ్చినప్పుడుమాత్రం మావూరు పోతూ కాలం వెళ్ళబుచ్చాను. మాఅమ్మకూడా పిల్లలవిష యమై లేనిపోని ఆరాటాలు పెట్టుకుని తను గోలపడి ఇతరులను కంగారుపెట్టే రకంకాదు.

మామామగారి చిన్నకూతురు రుక్మిణి అమిత పెంకె పిల్ల. పెంకెతనం కసీసం రెండురకాలు— చూసేవాళ్ళకు కోపం తెప్పించేరకం ఒకటీ. చూడముచ్చటగాఉండేది మరొకటీ. కొంతమంది మా అత్తమామల మాదిరిగా ఏరకమైన పెంకె తనమూ సహించలేరు. రుక్మిణిచేసే అల్లరి నాకు చాలా ముచ్చటగా ఉండేది, ఆమె తల్లిదండ్రులకు తలనెప్పిగా ఉం డేది. కొందరు పిల్లలు సహజంగా ఏడుపుగొట్టువాళ్ళయిఉండి చేస్తున్నపని తప్పని తెలిసి చేస్తున్నట్టు, చాటుమాటున అల్లరి చేస్తారు. వాళ్ళని చావగొట్ట బుద్ధవుతుంది నాకు. రుక్మిణి తన పెంకెతనం తనే ఆనందించగలది. ఆపిల్ల లోపల పొంగుతూ ఉన్న జీవశక్తిని ఆపుకోలేక దాన్ని అల్లరి రూపంగా విడుదల చేస్తున్నట్టుండేది. ఆపిల్ల పెంకెతనం అనారోగ్యంతో కూడు కున్నది కాదని నా తాత్పర్యం.

రుక్మిణి సాక్షాత్తూ నాకళ్ళఎదట పెరిగిందన్నమాట. నేను వారింట్లో ప్రవేశించేరోజుకు రుక్మిణి మూడు నాలుగు

నెలలపిల్ల. అందుచేత నేను కాలేజీలో ప్రవేశించేవరకూ తల్లి దండ్రులను ఆపిల్ల ఎంతబాగా ఎరుగునో నన్నూ అంతబాగా ఎరుగు. రామనాథంగారు మొదట మొదట ఆపిల్లచేత అల్లరి చేయించటానికి నాకు కావలసినంత స్వతంత్రం ఇచ్చాడు. రుక్మిణి నా ఆసరా చూచుకుని తల్లి దండ్రులకుకూడా ఎదురు తిరిగి అల్లరి చేస్తుండేది.

రామనాథంగారెప్పుడైనా నాతో, "దానికి నువ్వట్లా అలుసివ్వకు, నాయనా, అది మరీ మితిమీరి పోతున్నది," అంటే నేను, "పోనివ్వండీ! మీపెద్దమ్మాయల్లే మత్తాగా ఉంటేమాత్రం ఏం బాగుంటుంది?" అని ఆయన్ను సర్దేవాణ్ణి.

రుక్మిణికి స్వేచ్ఛవల్ల కలిగినలాభం ఏమిటంటే చురుకు తనం. ఆపిల్ల పైకి చూడటానికి ఎంత చలాకీగా ఆరోగ్యంగా ఉండేదో అంత చురుకైన బుర్రకూడా సంపాదించింది. ఆపిల్ల మగపిల్లలతోపాటు చెట్లూచామలూఎక్కటమూ, చెడుగుడూ కోతికొమ్మచ్చా ఆడటమూ మొదలైన పనులన్నీ చేసేది. తోటిపిల్లలు ఎవరైనా తనకు తీరని అన్యాయం చేసినట్టు తోస్తే వేరే ఆలోచనయేమీ లేకుండా చెంపమీద లాగి ఒకటి పెట్టేది. పాఠాలు చదివేదికాదు. ఆపిల్లచేత పాఠం చదివించటం మా ఎవరిచేతా కాలేదు. కాని తనఅక్క చదివే పాఠాలన్నీ విని వప్పగించేది. అప్పుడప్పుడూ అక్కచదువులో తప్పులుపట్టి మేష్టరుతనంకూడా సాగించేది. ఆ ఎనిమిది సంవత్సరాల కాలంలోనూ ఆపిల్ల అసహాయతవల్ల ఒక్కసారయినా ఏడిచినట్టు నాకు జ్ఞాపకంలేదు. రుక్మిణితో ఆడుకునే పిల్లల్లో ఎవరో ఒకరు రోజూ ఆమెమీద ఏదో చాడీ తెచ్చే

వాళ్ళు రామనాథంగారికీ ఆయన భార్యకూ మహా మోటు జాస్తి. ఎవరు తమ పిల్లమీద చాడీ తెచ్చినా తాము పిల్లను మందలించి తీరాలనే. రుక్మిణి సహజగుణంగా వెళ్ళి ఇంకొకరిని గిల్లి రాదని నాకు బాగా తెలుసును. అందుకని ఆపిల్ల తల్లిదండ్రులచేత తిట్లూదెబ్బలూ తినటం ఒకటే గోడుపాట్లు చూసి నేను సహించలేకపోయినాను. ఎవరైనా చాడీలు చెప్పితే నేను కేసు విచారణచేసి రుక్మిణివల్ల తప్పులేదని నిర్ధారణచేసి ఫిర్యాదుచేసిన పిల్లలను పంపేసేవాణ్ణి.

ఒక్క విషయంలో మాత్రం నేను రుక్మిణితోపాటు అపరాధినయినాను. చాలా చిన్నతనంలో రుక్మిణికి ఏవిధమైన మనఃక్లేశం కలిగినా దాన్ని పోగొట్టే మిషమీద ముద్దు పెట్టుకోవటం ఒకటి అలవాటుచేశాను. రుక్మిణి ఏదో వంక పెట్టి నాచేత ముద్దుపెట్టించుకొనేది. అయిదేళ్ళ రుక్మిణిని నేను ముద్దుపెట్టుకోవటం ఎవరికీ ఎబ్బెట్టుగా తోచలేదు కాని ఎనిమిదేళ్ళ రుక్మిణిని నేను ముద్దుపెట్టుకుంటుండంగా చూసిన ఒక పెద్దమనిషి—రామనాథంగారి బంధువు. చుట్టపుచూపుగా వచ్చాడు—తను చాలా కంగారు పడటమే కాకుండా రామనాథంగారితో కూడా అన్నాడు. మరొకరు అన్నమీదట రామనాథంగారికీ ఆపని ఆటే మంచిదికాదని తోచినట్టుంది. ఆయన నాతో అనటానికి చాతకాక రుక్మిణిని చాటుగా చివాట్లు పెట్టాడు, "ఏమిటది? అట్లా అతని ఒళ్ళో కెళ్ళి కూర్చుని ముద్దు పెట్టుకోనిస్తే ఎవరన్నా ఏమనుకుంటారు? ఎనిమిదేళ్లు వచ్చి ఎద్దల్లే!" అని.

రుక్మిణి సహజంగా తండ్రిమీద తిరగబడి పోట్లాడటమే కాక, ఆయన గోప్యంగా మాట్లాడబోతే తను ఇల్లంతా చిందులు తొక్కి పెద్దపెట్టున అరవటమేకాక, నాతో మానాన్న ఇట్లా అన్నాడనికూడా చెప్పేసింది. నాతో రుక్మిణి ఇదంతా చెప్పింది అని తెలిసిన తరవాత నేను తెలియనట్లు నటించితే నన్ను చూసినప్పుడల్లా ఆయనప్రాణం చచ్చిపోతుండేదేమోనని, "ఇక రుక్మిణి నాతో అంతచనువుగా ఉండనట్లు చూస్తానులెండి. ఇంకా రెండునెల్లు ఆతరవాత మీదయ ఉంటే ఈమెట్టుదాటి కాలేజీ ఉండనేఉంది...అయినా నేను రుక్మిణిని చిన్నపిల్ల గదా అని ఎప్పుడూ ముద్దుపెట్టుకుంటూనే ఉన్నాను. ఏ తారీకునించీ మాని ఉండివలసిందో నాకు ఇప్పటికీ తెలియకుండాఉంది!" అని కాస్త ఉంటించాను.

ఆయన, "ఆఁ! దానికింత రాద్ధాంతం ఏమిటి? మా చుట్టం తప్పుపట్టాడని అందరిఎదటా ఎందుకట్లా మగవాళ్ళ మీదికి ఎగబాకుతావన్నాను కాని మరేంలేదు, నాయనా! నువ్వంటే సరేసనుకో! మరొకరు రాతారు!..."అని తన్ను సమర్థించుకోజూచాడు.

నేను కాలేజీలో ప్రవేశించిన తరవాత చాలారోజులు రుక్మిణి దగ్గరలేని వెల్తి కనబడది ఆపిల్లకోసం నేను బెంగపడ్డాను కూడానూ. మొదట్లో దాదాపు ప్రతిరోజూ కల్లో కనిపించేది. నాకాపిల్లమీద ఎంత మమకారంఉందో దూరం వెళ్ళినతరవాత గాని తెలియలేదు. వారంపదిరోజులు శలవులకు కూడా నేను ఇంటికి వెళ్ళేవాణ్ణి ఆ సంవత్సరం. దారిలో కాబోయే మామగారింట్లో ఒకరోజుఉండి మరీ మాగ్రామం

వెళ్ళేవాణ్ణి. రుక్మిణి వెనుకజరిగిన చిన్నఘర్షణ మర్చిపోక నేను వాళ్ళింటికి వెళ్ళినప్పుడల్లా నన్ను పట్టుకునే వేళ్లాడేది, నాఒళ్లోకూర్చొనే కూర్చునేది, నన్ను అడిగి ముద్దుపెట్టించు కునేది.

•

అంత పట్టుదల పిల్లను నేనెక్కడా చూడలేదు!

ఆచలికాలపు శలవుల్లో మానాన్న నా పెళ్ళిని గురించి ప్రస్తావిస్తూ, "రామనాథంగారికి వాళ్ళమ్మాయిని నీకివ్వాలని ఉంది. నన్నడిగాడు. నీకేమైనా అభ్యంతరంఉందా?" అన్నాడు.

నాకావార్త చాలా తృప్తికరమయింది. అంతకాలం వారింట్లో ఉండి నాకి కుటుంబం వదలిపెట్టగానే కలిసిన బంధుత్వం బలవంతంగా తెగకోసుకున్నట్టనిపించింది. తరవాత ఒకటీ అరారోజు వారింట్లో గడపబోతే అది పరాయియిల్లే అనిపించింది కాని వెనకటిమాదిరిగా లేదు. ఏమాత్రమైనా నాకు వెనకటిరోజులు ఇంకా అయిపోలేదనిపిస్తే దానికి రుక్మిణి ఒక్కత్తే కారణం.

"నాకేమీ అభ్యంతరంలేదు, నాన్నా!" అన్నాను. నా ఉత్సాహం గమనించి మా నాన్న వెంటనే రామనాథం గారి సంబంధం ఖాయంచేసుకున్నాడు. వచ్చేవేసవిలో పెళ్ళి అనుకున్నారు.

నాకు ఒకటేసంతోషం-రుక్మిణి నాకు మరదలు అయిపోతుంది. పెళ్ళిఅయితే మా యిద్దరిచుట్టరికమూ ఖాయం అయిపోతుంది. తరవాత ఎవరూ దాన్ని మార్చలేరు.

బావామరదలు బాంధవ్యంకంటె దగ్గిరబాంధవ్యం మా ఇద్దరికీ కలగటానికి అవకాశం ఉందనికాని, నేను దాన్ని ఎప్పటి

లైనా వాంఛించబోతానని కాని నేను అప్పట్లో ఏమాత్రమూ అనుమానపడలేనుకదా!

నేను మళ్ళీ రామనాథంగారింట్లో అడుగుపెట్టటం స్నాతకంచేసుకున్న పెళ్ళికొడుకునుగా.

మా మామగారితరఫు పెద్దమనిషి మా విడిదికి వచ్చి, "అయ్యో! ఇంకా ఇట్లాగే కూర్చున్నారేం? ముహూర్తానికి మళ్ళీ వ్యవధానం ఉండదు. లేవండి!" అని ఉచితరీతి ఏదైతే ఉందో ఆరీతిగా మమ్మల్ని కదలదీశాడు. నేను ఆపెళ్ళివారి వసారాలో అడుగుపెట్టేటప్పటికి లోపల్నించి రుక్మిణి బయటికి వచ్చి నన్నుచూసి క్షణమాత్రం అట్లా ఆగింది.

ఆ దృశ్యం నేనెన్నటికీ మరవలేను. తలంటిపోసుకున్న జుట్టు ఆరటానికి విరబోసుకుని, మొహాన కల్యాణంబొట్టు పెట్టుకుని, బుగ్గన చిన్న దాటుకచుక్క పెట్టుకుని, కాళ్ళకు పసుపూపారాణీ పెట్టుకుని, కొత్తచొక్కా పరికిణా కట్టుకుని రుక్మిణి కనిపించేటప్పటికి నాకు మతిపోయింది. ఆక్షణంలో గ్రహించగలిగాను నాకాపిల్లతో ఎటువంటిబాంధవ్యం కావాలని నా అంతరాత్మ వాంఛించుతున్నదో. రుక్మిణి నన్నుచూసి ఆగిన క్షణమాత్రంలో నా మనస్సులో ఒకఆశ అట్లా తళుక్కున మెరిసింది. ఏదో ప్రోగ్రాములో మార్పుజరిగి. నేను రుక్మిణినే పెళ్ళిచేసుకోబోతున్నానని! ఆ ఆలోచనామాత్రం చేతనే నామనసు ఎట్లా స్తంభించిపోయిందో మీరే ఊహించండి—రుక్మిణి వేసినవేషం తోడుపెళ్ళికూతురు వేషమని ఆమెను అడగకుండా నాఅంతట నేను ఊహించనేలేకపోయినాను!

ఒక్కక్షణంసేపు తనకళ్లను నమ్మలేనిదానల్లే రుక్మిణి నావంక అట్లా చూసి ఒక్కపరుగునవచ్చి నా నడుము చుట్టు వేసుకుంది... నేను అక్కడఉన్న మనుష్యులను ఎవరినీ లెక్క చేయకుండా రుక్మిణిని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాను.

ఆముద్దు నేను పూర్వం రుక్మిణిని పెట్టుకున్న ముద్దుల జాతిదికాదు. కాని, పాపం, రుక్మిణి ఆతారతమ్యం గ్రహించగల స్థితిలో లేదు.

నా వివాహంఅయిన మరుసటి సంవత్సరమే రుక్మిణి వివాహం జరిగింది. మామామగారు ఆపిల్లకు మంచి సంబంధం—పెద్దకూతురికికన్న మంచి సంబంధం తెచ్చాడని ఆయన బంధువర్గం అభిప్రాయపడ్డట్లు విన్నాను. రుక్మిణి మొగుడు నాకంటె తప్పకుండా అందమైనవాడు, పస్తుతానికి అతనికి నాకు ఉన్నంతఆస్తి లేకపోయినా, అతని బంధు వర్గంలో చాలా గొప్పగొప్ప ఉద్యోగస్తులున్నారు, నాకంటె కాస్త పైగ్రేడు కుటుంబీకుడనే చెప్పాలి.

కాని మాషడ్డకుడు కొన్నికొన్ని విషయాల్లో అదొక రకంమనిషి దాచాలని ప్రయత్నంచేసేవాడే కాని అతను [illegible] అని అతని ప్రతిపనిలోను అతను ఉచ్చరించే ప్రతిమాట లోనూ స్పష్టంగా స్ఫురిస్తూనే ఉండేది, గ్రహించగలవాడికి. అతనికి ప్రత్యేకంగా దేన్నిగురించీ సుమారుగానైనా తెలిసినట్లు కనబడలేదు. ప్రతిదాన్నిగురించీ ఏదో మాట్లాడాలని ప్రయత్నించేవాడే కాని అతని అభిప్రాయాలన్నీ జనసామాన్యం యొక్క అభిప్రాయాలుగానూ, అతని అభిరుచులుకూడా తుమ్మాయి జగ్గాయిగాళ్ళ అభిరుచులుగానూ తేలినై, కాస్త

విచారించిన మీాదట. అతనికి ఖచ్చితమైన అభిప్రాయాలు లేనేలేవు. అవి ఏగాలి ఎటుకొట్టితే అటుమళ్ళేవి. అతనిలో నేను గమనించిన మరొక విశేషం ఏమిటంటే, ఎవరితోనైనా ఏవిషయమైనా తర్కించటం జరిగితే అవతలవాడు ఎన్నికారణాలు చూపించినా వాడితో ఏకీభవించక, వాడితర్కం మరొకడితో తర్కించేటప్పుడు ఉపయోగించేవాడు. ఆడవాళ్ళు చదువుకోటం చాలా అనర్థంఅని నాతో వాదించి నేనెంత చెప్పినావినక, మర్నాడు నాసమక్షానే ఇంకొకరితో ఆడవాళ్లు చదువుకుని తీరాలని వాదిస్తూ నేను చెప్పినకారణాలే చెబుతున్నాడు.

అన్నిటికన్నా విచిత్రమైనవిషయ మేమిటంటే నేను తనను చూసి అసూయపడుతున్నానని అతనికొక అభిప్రాయం ఎట్లాపడ్డదో పడ్డది తనకు. నామీాదగల ఆధిక్యత నా ఎదట మరుగుపరిచి నా అసూయను ఉపశమింప జెయ్యటానికి విశ్వప్రయత్నం చేసేవాడు!

నేను అతన్నిచూసి ఒక్కందుకే అసూయపడ్డాను— అతను రుక్మిణి భర్తఅయినందుకు. అందులో అతని ఆధిక్యత నాకేమీా కనిపించలేదు.

ఇంకా కొద్దిరోజులకు కాపరానికి వెళ్లుతుందనగా రుక్మిణి మాయింటికివచ్చి ఒక వారంరోజులున్నది. ఆరోజుల్లో ఆమె తనఅక్కను బాగా కోప్పడేది ప్రతిదానికీ.

"ఈ కూర ఇట్లాచేశావేం, అక్కయ్యా! బావకిట్లా సయించదు!...ప్రతిదానిలోనూ ఇంత కారంవేస్తావేం? బావకు కారం పడదు!...పూరీ లెందుకుచేస్తున్నావే? బావకు

పూరీలు తినటం అంటే తగనిమంట!... బావకు ఈ సగ్గు బియ్యపు పరమాన్నంకంటె బియ్యపుపరమాన్నమే ఇష్టం గాదూ?"

రుక్మిణి అట్లా మాట్లాడుతుంటే నాకు కడుపులో చెయ్యిపెట్టి కలియబెట్టినట్లుండేది. పిచ్చిపిల్ల! ఆ వారంరోజుల్లోనూ తన అక్కను తనమాదిరిగా చేసిపోదామని!

అప్పటికికూడా రుక్మిణికి నామీద అభిమానంకాని వెనకటి మొండితనంకాని ఒక్కరవ్వయినా పోలేదు. తను వెనకటిమాదిరిగా, నన్ను పట్టుకుని ఊగటానికి లేదనికూడా ఆ పిల్లకు అర్థంకాలేదు. నేను జాగ్రత్తగా తప్పించుకుని తిరగక పోతే రుక్మిణి నా భార్య నిష్కారణంగా అనుమానపడేటట్టు చేసేదే!

రుక్మిణి ఒకవిధంగా చాలా దురదృష్టవంతురాలు. అనేక విధములైన అదృష్టాల్లో ఒకటి ఏదంటే మనసుఖం ఎవరెవరి మీద ఆధారపడిఉంటుందో వారికి మన స్వభావం నచ్చేటట్లు మనలను మనం మార్చుకోగలగటం. రుక్మిణివంటి మనిషి ఎవరి కోసమూ మారలేదు. ఆ రకం నేనెరిగినంతవరకు నేనొక్కణ్ణి తప్ప మరెవరూ ఆమోదించలేదు. రుక్మిణిసుఖం నామీద ఆవగింజంతకూడా ఆధారపడి లేదు.

ఆపిల్ల తల్లిదండ్రులతో సుఖపడలేదు. భర్తకూడా ఆమెను సుఖపెట్టలేదు. అసలే చపలచిత్తుడు, ఆలోచనాశక్తి గాని, గ్రహణశక్తిగాని లేనివాడు. అతనికి భార్యఏమాటమాట్లాడినా అనుమానంగానే ఉండేది తన్ను భార్య చులకనచేస్తున్నదనీ, ఆమెకు పాపభీతిలేదనీ, చాలా "విడిచేసినమనిషి" అనీ

అతనికి భార్యనుగురించి అనుమానం కలగటం మొదలుపెట్టింది. అతని అనుమానం నామీదికి తిరగటానికి ఎంతో కాలం పట్ట లేదు. రుక్మిణి తనకు నామీదగల అభిమానం భర్తదగ్గర ఏమాత్రమూ దాచినట్టు కనిపించదు. చివరకు నేను అతన్ని చూసి అసూయపడటం అబద్ధమై అతను నామీద అసూయ పడటం నిజమైంది.

అతను భార్యను తిట్టకుండా కొట్టకుండానే చాలా వేచుకుతినా్నడు. ఒక్క సంవత్సరకాలంలో ఆమె ఉత్సాహం పూర్తిగా విరిచివేశాడు.

నేను పనిమీద వాళ్ళఊరు వెళ్ళవలసివచ్చింది. సహజంగా నేను వాళ్ళింటికే వెళ్ళాను అదే నేను రుక్మిణి కాపరం చేస్తుండగా మొదటిసారి చూడటం. ఆమెను చూడగానే నాకు దాదాపు కళ్ళనీళ్ళపర్యంతరం అయింది. మాపడ్డకుడు బయటికి వెళ్ళాడు.

"రుక్మిణీ! ...ఎవరు నిన్నిట్లా మార్చింది?"

"అంత మారిపోయినానా?" అన్నది రుక్మిణి చెక్కిళ్ళు తడుపుకుంటూ.

ఆసమయంలో మాపడ్డకుడు ఎదటఉంటే హత్య చేతామనిపించింది. అతను రుక్మిణిని చేసిందేమిటి? ఆమార్పుకు అతనే కారణమని నేను గ్రహించలేనా?

"మారిపోయినావా? లేదు, సాంతంగా చచ్చిపోయినావు! ...ఎందుకిట్లా అయింది?"

రుక్మిణి ఏం చెబుతుంది?

మామయ్యకుడు ఇంటికి రాగానే నన్నుచూసి పరమా నందభరితుడైనట్లు కనిపించాడు.

నేను భోజనంచేసి పనిమీద వెళ్ళాను. నాపని నాలు గయిదురోజులు పట్టేటట్లు కనిపించింది. ఆరాత్రి నేను హోట లుకు వెళ్ళుతానంటే మామయ్యకుడు కాదు, కూడదు, ఈనాలు గురోజులూ మాయింట్లోనే ఉండాలి అని నన్ను నిలపివేశాడు. అతనికి మారుచెప్పటం నాకిష్టం లేకపోయింది. రుక్మిణి మొఖం ఏంసూచిస్తుందోనని ఆమెవైపు తిరిగేటప్పటికి ఆమె మొగుడి వీపువంక మూడోకన్ను తెరిచి చూస్తున్నది. నాకదేమిటో అర్థంకా లేదు.

మర్నాడుదయమే అతను కాఫీఅపీ తెప్పించి ఆపని పూర్తికాగానే ఊళ్ళోకి వెళ్ళాడు.

అతను ఇల్లుదాటగానే రుక్మిణి నాదగ్గిరికి వచ్చి నాతో కాసేపు మాట్లాడాలన్నది. కానిమ్మన్నాను. అప్పుడామె తన భర్త గొడవఅంతా చెప్పుకొచ్చింది.

"నువ్వు నిన్న నన్ను చచ్చిపోయినా నన్నావు జ్ఞాపకం ఉందా? నాకు సాక్షాత్తూ అట్లాగేఉంది, బావా! మీతమ్ముడు గారు నేను చేసిన పనికల్లా ఆడినమాటకల్లా తప్పుపడతారు. కారణం ఏమిటో తెలియదు. నాకు కొంతకాలంనించీ జంకు కలుగుతున్నది నామనస్సు అందరి మనస్సులవంటిది కాదేమో, నేను పట్టి పాపిష్టదాన్నేమోనని. నువ్వు నన్ను చిన్నప్పటినించీ ఎరుగుదువుకదా? నాలో పాడుగుణాలు ఏమేమి ఉన్నయ్యో చెప్పు! నువ్వు చెప్పితే నాకు నమ్మకం. నాతప్పులేమిటో దిద్దు కుంటాను... చిన్నప్పటి రోజులు ఎంతబాగుండేవి!... నీకళ్ళకు

కూడా నేను పాపిష్టిదాన్నల్లే కనిపిస్తూన్నానా? వెనక నన్ను చూసినట్టు చూస్తావా, బావా? చూడవు కాదూ?...ఆరోజు లెంతబాగుండేవి?...అప్పుడు భయం ఏమిటో ఎరగను. నా కిప్పు డెందుకింతభయం?...నువ్వు వచ్చినప్పటినించీ నాకుమళ్లీ ప్రాణం వచ్చినట్టుంది! నాకు ఇల్లంతా చిందులు తొక్కాలని పించింది. ఇంతలో ఆయన వచ్చారు. తరవాత నువ్వెక్కడికో వెళ్లావు. ఇక నువ్వు వెళ్లినప్పటినించీ, బాబూ, ఏంమాట్లాడా రనుకున్నావు? చాలాసేపు నాకేమీ అర్థంకాలేదు. 'నీకోసం వచ్చారే మీవారు!' అంటూరు! మీవారు అంటే నీమొగుడని అర్థంకాదు, బావా? అట్లాఅంటం తప్పుకాదూ! నాకు వళ్లు మండిపోయింది. 'అవును! నాకోసం ఎందుకురాడు? మాబా వకు నేనంటే ప్రాణం!' అన్నాను. 'నీకో?' అన్నారు. 'అయ్యో, బాగుందే? నాకూనూ!' అన్నాను. 'ఆయన మొహం చూసేటప్పటికి ఎంత ధైర్యంవచ్చిందీ?' అన్నారు. నిజంగానే నాకెంతో ధైర్యం వచ్చింది, బావా--నువు నమ్ము తావో నమ్మవో...ఆకోపం మళ్ళీ నామీందే చూపించటం, నీతోచూడు ఎంతఆపేక్షో! ఎట్లా మర్యాదచేస్తారో ఉండమని!

"మనం నిజంగా మళ్ళీ చిన్నపిల్లలం అయితే?...(ఆను ర్దాగా) నువ్వు నన్ను మళ్ళీ వెనకటిమల్లే ముద్దు పెట్టుకుం టావా, బావా?"

"ఆ! పెట్టుకుంటాను!"

రుక్మిణి మొహాన ఒకవిధమైన తృప్తివచ్చింది. తృప్తి అనుభవిస్తూ కాస్సేపుండి, అకస్మాత్తుగా, "నీకు నిజంగా నేను పాపిష్టి దాన్ననిపించటంలేదుగా?" అన్నది.

"లేను, రుక్మిణీ!"

వెనక రుక్మిణి ఎంతో తెలివితేటలు కలదిగా చురుకుగా ఉండేది. ఆ రుక్మిణేనా ఈమాట్లాడేది అని ఆశ్చర్యపడసాగాను. అతను ఆమెను ఇట్లా ఎట్లా చెయ్యగలిగాడు?

రుక్మిణి మళ్లీ నావంక తిరిగి అనుమానిస్తూ, "నన్ను ఒక్కసారి వెనకటిమోస్తరుగా ముద్దు పెట్టుకుంటావా, బావా?" అన్నది.

నేను ఆశ్చర్యపడి, "ఎట్లా పెట్టుకోగలను, రుక్మిణీ?" అన్నాను.

"నువ్వుకూడా నన్ను పాసిప్టిదానికింద నే కట్టేశావు! ఎందుకు అబద్ధం ఆడుతావూ?" అన్నది రుక్మిణి పుట్టెడు దిగులుతో.

"అది నాదికాదు. నువ్విప్పుడు పెద్దదానివి కాలేదా? నేను నిన్ను ముద్దుపెట్టుకోవటం తప్పుకాదా?"

"వెనకనో?"

"అప్పుడు పెట్టుకున్నదారివేరూ! అప్పుడుచిన్నపిల్లలం!"

"అట్లాగే ఇప్పుడూ పెట్టుకో!...ఏమీలేదు, బావా. ఎట్లాగైనా నేను వెనకటిదాన్ననని నేను నమ్మేటట్టుచెయ్యి."

"నేను చెయ్యలేను. ఆమాటంటే ఆలోపం నీలో ఉందనుకోకు! నాలోనే ఉంది. నామాట నమ్ము!"

"నీలోనా? నేను నమ్మను. నువ్వేంమారావూ?"

"ఏంమారానా? నేను నిన్నువాంఛించటం నేర్చుకున్నాను. నువ్వు నాకు కావాలి. కాని నిన్ను నోరుతెరిచి అడిగేటందుకుకూడా దమ్ములేదు నాకు. నేను వెనుకటివాణ్ణి

గాను. ఇప్పుడు నువ్వు వెనుకటిమాదిరిగా నా ఒళ్లో కూర్చుని నన్ను ముద్దుపెట్టుకోనిస్తే నాకు నీమీదగల మోహం కట్టలు తెగిపోతుంది. నేను వెర్రివాణ్ణయిపోయి నిన్నూ నన్నూ కూడా అపాయకరమైనస్థితిలోకి తెస్తాను. నీ బంధువులూ నా బంధువులూ తలలు పగలకొట్టుకోవలసి వస్తుంది!...ఇంతవిపులంగా ఇది నాచేత వప్పించి నీ పెంకెపట్టు సాధించావు. తృప్తి అయిందా ?"

రుక్మిణి నావంక ఒక్క క్షణం దీనంగా చూసింది.

"అప్పుడే నేనంతపెద్దదాన్నయినానా, నీకు ?...ఇంకేం అదే పాపిష్టిదాన్నికావటమంటే ! నువ్వు కనుక్కో లేకపోయి నావు !" అన్నది రుక్మిణి.

రుక్మిణి అన్నమాటలో నిజంలేదా ?



# ౭. అనంతం

అనంతపథాన ఇద్దరు సూక్ష్మ జీవులు కలుసుకున్నారు. అదొక అపూర్వ సంఘటన.

ఆఇద్దరూ ఒకప్పుడు భౌతిక శరీరాలు ధరించి ద్వంద్వాలకు లోబడిన వారే. ఇద్దరూ వారివారి జీవితాలలో అసామాన్య వ్యక్తులే. ఒకడి జీవితం భూగోళంమీద గడిచిపోయింది. మరొకడు బతికిఉండగా అంగారక గ్రహవాసి.

ఇప్పుడిద్దరికీ విముక్తి కలిగింది. ఇప్పుడు వారికి బ్రహ్మాండంలో పోరానిచోటు లేదు తెలియరాని విషయం లేదు. మన మానవుల దృష్టిలో వారు కాలాన్నీ దూరాన్నీ జయించిన వారే. వారు జయించలేని కాలమూ దూరమూ మనము ఊహించుకోనైనా లేము.

వారు కలుసుకున్న ప్రదేశం భూమీ అంగారకుడూ సూర్యుడి చుట్టూ సంచరించే మార్గాలకు మధ్యగా ఉంది. అక్కడ గాలి లేదు కనక అక్కణ్ణించి ఆకాశం నీలంగా కనిపించక కాటుక రంగుగా కనిపిస్తున్నది. అక్కడ రాత్రింబగళ్ళు లేవు. ఎల్లప్పుడూ తారాగణమూ గ్రహాలూ స్ఫుటంగా కనిపిస్తున్నవి. తారలు మినుకుమినుకు మనకుండా నిలబడి వెలుగుతున్నవి. అక్కడకి భూమిసగం మాత్రమే కనిపిస్తున్నది. అంగారక గ్రహం మాత్రం మూడువంతులకు పైగా కనిపిస్తున్నది. గ్రహాలు సూర్యకాంతికి ఎదురుగా పోతున్నప్పుడు సూర్యకిరణాల తాలూకు అలల్లో కలుగుతున్న సంక్షోభం వారి సూక్ష్మనేత్రాలకు కనిపించటమే కాక ఆనందంకూడా చేకూర్చుతున్నది.

"ఏమి ఈసృష్టి సౌందర్యం!" అన్నాడు మానవుడు, చుట్టూ కలయజూస్తూ. "నాకు విముక్తి కలిగిన క్షణంనించీ దీన్ని తనివిదీర ఆనందిస్తున్నాను-ఈపర్యాణాన్ని. ఈవింత నాకు విసుకు కలిగించలేదు. ఇట్లా అనంతకాలం జరిగిపోయినా నాకు తృప్తే!"

మానవుడు నోరు తెరిచిన క్షణంనించీ కనిబొమలు ముడేసి అతని వంక అర్థం కాని వాడల్లే చూస్తున్న ఆంగార కేయుడు పక్కున నవ్వాడు.

"ఇందులో వింతఏమిటి, వత్సా?" అన్నాడావృద్ధుడు.

"అంతా లెక్క ప్రకారం జరిగి తీరవలిసిందే. నువ్వు గణిత జ్ఞుడివి కావల్లేవుంది. మామండలంలో మేమంతా కీలత గాళ్ళమే."

"కీలతగాళ్లనగా? ... మీరంతా శాస్త్రజ్ఞులని విన్నామే!"

"శాస్త్రమా? మాది మొదటినించి చివరవరకూ కీలతశాస్త్రమే. వ్యక్తిని చెయ్యగానే—"

"మీరు వ్యక్తులను చేస్తారా?"

"లేకపోతే ఎట్లా? ఎప్పుడైనా ప్రమాదంజరిగితే జన సంఖ్య తక్కువయిపోదూ? నామటుకు నేను ప్రమాదం వల్లనే విముక్తిపొందాను నేనుపోగానే మా జనసంఖ్య తొమ్మిది తొమ్మిది తొమ్మిదులలో ఒకటి తగ్గిపోలేదా?"

"తొమ్మిదిసంఖ్య ఏమిటి?"

"మీరు తొమ్మిదిబొట్లతో తొమ్మిదిమీద మరొక సంఖ్య (మానవభాషలో పది) చేసుకున్నారు. మేము సున్నాను సంఖ్యగావాడము. అట్లా వాడితే మా గణితమంతా తారుమారవుతుంది... నేను చెబుతున్నట్లు నేను విముక్తిచెందగానే మావాళ్ళు మరొకర్ని చేసుకుంటారు. ఒక యంత్రం తక్కువ అయినా మా పని ఆగిపోతుంది."

"యంత్రమా ?" అన్నాడు మానవుడు నిర్ఘాంతపోయి.

"అవును. మనమంతా ఏమిటి? యంత్రాలం కామా?"

"చాలా చిత్రంగా ఉంది. యంత్రంలో ఆత్మ ఉంటుందా? మనలో యంత్రంమాత్రమేకాక ఆత్మకూడా లేదా ?"

ఈసారి నిర్ఘాంతపోవటం అంగారకేయుడి వంతు.

"ఆత్మ—అంటే ?"

"భౌతిక స్వరూపం లేనిది. జీవినించి భౌతికపదార్థం యావత్తూ రాలిపోయినతరవాత మిగిలేది."

"అటువంటి దేమీ లేదు !" అన్నాడు అంగారకేయుడు గట్టిగా. "ఉంటే నా లెక్కలన్నీ తప్పుపోవలిసిందే !"

"జడశరీరం విసర్జించి ఈ సూక్ష్మశరీరం ధరించిన మీరు కూడా ఆత్మ లేదంటే నేనేం చెప్పనూ ?"

వృద్ధు నవ్వాడు.

"ఇదా నువ్వు గ్రహించింది? నీ జడశరీరం ఎప్పుడయితే నిర్మించబడిందో దానివెంట—ఈ సూక్ష్మశరీరమే కాదు—ఇంతకంటె సూక్ష్మపదార్థసహితములైన శరీరములూ అప్పుడే నిర్మాణమయినై. అవి ఒకదానికంటె ఆలస్యంగా మరొకటి గాలిపోతై. ఏమీ మిగలదు. నాకు ఆ శరీరపదార్థాల తాలూకు లెక్కలన్నీ కరతలామలకమే. ఒక్కక్షణంలో నీకు అదంతా బోధపరుస్తాను !"

"క్షమించండి!" అన్నాడు మానవుడు కంగారుపడి. అతనికి ఇంటెగ్రల్ కాల్క్యులస్ జ్ఞాపకం చేసుకోవాలనే ఇచ్ఛ ఎంతమాత్రమూ లేదు. "అయితే ఒకటి చెప్పండి. ఆసూర్యుణ్ణి చూడండి. ఆసూర్యగోళంలో జీవితం సాధ్యమా? ఒకప్పుడు

మీగోళమూ మాగోళమూ అట్లాగే ప్రజ్వలిస్తూ ఉండేవని ఒప్పుకుంటారా? అటువంటిచోట జీవంఅనేది బయలుదేరింది. అటు చంద్రమండలంవంక చూడండి. అక్కడ ఇప్పుడు జీవితం అసంభవం — మర్త్యులమాట చెపుతున్నాను సుమండీ. అక్కడ ఒకప్పుడు ప్రాణం ఉండి ఉండవచ్చును. ఒక గోళం చల్లారటం మొదలుపెట్టి పూర్తిగా చప్పబడి పొయ్యేలోపల ఆగోళంమీదికివచ్చి పొయ్యేప్రాణం అనేది దేవుడనేజ్యోతి తాలూకు రవ్వ అంటారా కాదంటారా?"

"ఉండు, ఉండు! తాకు బొత్తిగా అర్థంచేసుకోటానికి వీలులేనిమాటలు బోలెడన్ని ఉపయోగించావు. ప్రాణం ఏమిటి? దేవుడేమిటి? అసలునువు మాట్లాడుతున్నది దేన్ని గురించీ?" అన్నాడు వృద్ధు.

దేవుడంటే తెలియకపోతేమాన ప్రాణం అంటేనూ ప్రాణి అంటేనూ తెలియదా? ప్రాణం అంటే చైతన్యానికి కారణభూతమయింది. ప్రాణి అంటే ప్రాణంతో కూడుకున్న యంత్రం — మీమాటే ఉపయోగింతాం!"

"చైతన్యానికి కారణభూతమయినది శక్తి. ఆశక్తి కరిగిన లోహంలో ఉన్నంతా ఘనీభవించిన లోహంలో ఉంది- ఇంచుమించుగా... నీసందేహం ఏమిటీ?"

ఆముసలివాడితో వాదించటం చాలా కష్టమని కనుక్కోటం మొదలుపెట్టాడు మానవుడు. కాని ఇంకా కొంచెం ప్రయత్నించి చూతామనుకున్నాడు.

"మీగోళంమీద వ్యక్తులున్నారాలేరా? అటువంటి వ్యక్తులు చంద్రమండలంలో లేరేం?"

